సురలు నరులు కోరు - వరము లిత్తురని
ఘోషించుచున్నవి - గురు పురాణములు
ఘనదేవతవు నీవ - కరుణింప కున్నఁ
బ్రాణమ్ము లిచటనేఁ - బాయుదు ననఁగ
నలువయుఁ బోవు ప్రా - ణము లీయలేఁడు
చక్రవాళమున వా - సము చేయు వేల్పు
లీఁ గలరేని యే - నీయంగఁగలను
[1] అంగమ్ములేని బ్ర - హ్మలు నాల్గుతెగలు
రూపున్న పదియు నా - ఱుగురు బ్రహ్మలును
దేవ గణము లాఱు - తెగలును చంద్ర
సూర్యులాఱు తెగల - సురగణములును
పలు తెగలై యున్న - ప్రావేలుపులును
నెవ్వగల్ కుడుచు [2] నె - న్మిది తెగలైన
నరకవాసులు గగ - నమున రిక్కలును
గ్రహసమూహమ్ము న - క్షత్రంబు లెల్లఁ
దనలోన నడఁగించు - కొనియున్న చక్ర
వాళంబు నందున్న - వరదాతృవరుల
నెదుట నిలిపి చూపి - యీమె దుఃఖమ్ము

1. చూ. ప్రస్తావన.

2. నరకములు 8 తెగలు :— మహానిరయము, రౌరవము, కాలసూత్రము, సంజీవనము, మహావీచి, తపనము, సంప్రతాపనము, సంఘాతము.

వదలుఁ గాక యని చం - పావతి పలుకు
పగిదిని సర్వ దే - వతలును పలుక
వినియామె తనచింత - వీడి సుతునకుఁ
జరమ క్రియలుచేసి - చన్నయాపిదపఁ
జంపావతి పిలువఁ - జను దెంచినట్టి

వేలుపు గమి చక్ర - వాళ మందున్న
మేరువు కడ సప్త - మేదినీధ్రములు
వానిలో నొక్కొక్క - దానిని చుట్టి
యున్న సప్తాంభోధు - లొగి వానిఁజుట్టి
యలరు నాలుగు దీవు - లందు సొంపారఁ

జతురబ్ధి వేష్టిత - జగతియై వేయి
దీవులు చుట్టి సం - దీపించుచుండు
నేరేటి దీవిని - నెలకొన్న జీవ
వితతులఁ దెగలుగ - విభజించి వాని
కాయముల్ మట్టిచేఁ - గావించి మయుఁడు

విభజించి బొమ్మల - వెవ్వేఱునుంచు
చక్రవాళ మిది ని - శ్చల చిత్తలార !
ఇది కాటి ప్రక్కనే - యెసఁగిన కతన
నొలికి మెట్టని జనుల్ - పలికెడువారు
దీని వృత్తమ్మిది - తెలిపితి ననుచుఁ

జలచి త్రయమె యుగ - చాట్లొంది పుట్టు
వారి జీవిత మిట్లు - వఱలెడిదంచు
మణిమేఖల తలఁచె - మణిమొలనూలి
పేరి వేలుపు వచ్చి - కారు చీఁకటిని
యొడలు మఱచి నిద్రఁ - బడు సుతవతిని
వదలి యవ్వలి దాని - మది చొక్కఁ జేసి
యలమి యెత్తికొని వి - యద్వీథి నేగి
ముప్పది యోజన - ములు దాఁటి యవల
వలదెసఁ జని మణి - పల్లవ మందు
మణిమేఖలను డించి - మణిమేఖలాంబ
దీవి యందే తాను - దిచ్చుమోమయ్యె.

---

## ౬. మేలుకొలుపుట

మణిమేఖలాదేవి - మణిపల్లవమున
మణిమేఖలను వీడి - మఱిఁగిన పిదపఁ
బడఁతుక నుద్యాన - వనమునఁ గన్న
యుదయుఁడు మిక్కిలి - యుడికి చింతిల్లి
యీ రేయి కడవ నా - యింతి నాచేతి
లోనిదే యని యెద - లోని తాపమునఁ
బడక పొందక కుందు - వాని యెట్టెదుటఁ

దోఁచి రాజకుమార ! - దొర ధర్మవిధులఁ
బొరపడునేని యీ - ధరణి పాలనము
కుంఠితమై చెడుఁ - గురియదు వాన
వాన కురియదేని - ప్రాణులు చచ్చు
జీవు లన్నియుఁ దన - జీవంబు లనెడి
న్యాయంబు రాజ పుం - గవులకుఁ గలదు
తపసి వృత్తి వరించు - తరుణిపై నుంచు
వలపు వదలుమని - వనమునఁ జొచ్చి
చొక్కి నిద్రించు నా - సుతమతి లేపి
యీ నగరమ్మున - నేఁడేఁట జరుగు
నింద్రోత్సవము గాన - నేగుదెంచితిని
చెలువ నీ చెలిపేరఁ - జెలఁగు వేలుపను
బుద్ధధర్మపథానఁ - బోవ హేతువులు
కలిగెఁ గావున నీదు - చెలిమికత్తియను
మఱపించి కొనిపోయి - మణిపల్లవమున
నుంచితి నయ్యెమ - యొగిఁ బూర్వ జన్మ
మెఱఁగి యిటకు నేఁటి - కేడవనాఁడు
వచ్చి చేరును శంక - వలదు నీ కామె
వేఱు రూపమ్మునఁ - జేరినఁ గాని
జన్మనై జమ్ము దాఁ - చఁగఁ గాదుగానఁ

దెలియుంగ వచ్చు నీ - దేశంబు చేరు
తఱి నిటఁ దోఁచు చి - త్రంబులు పెక్కు-
కలవు మాధవి కిట్లు - కలిగిన తీరు
నుత్తమయగు పుత్రి - యొందిన విధము
నాదు వృత్తాంతంబు - నయమునఁ జెపుము
జలధిలో నున్న మా - యిలువేల్పు పేరు
బాలకుఁ బెట్టంగ - వలయున యంచుఁ
గోవలుఁ డాపేరు - కూఁతున కుంచు
నిసి మారుఁ డమ్ముల - వెసఁ బాఱవైచి
వేసర, బమ్మెర - నాసలఁ గోసి
తపసి వృత్తింబూను - తనయను గంటి
వని స్వప్నమున వలె - నంటిఁ దెల్లముగ
నిదియు నామెకు జ్ఞప్తి - పొదలఁ దెల్పుమని
మణిమేఖలాదేవి - మఱుఁగైన యంత
మదిఁ గుమారిలి సుత - మఱి లేచి యచట
నాటకాచార్య గ - ణంబుల తోడఁ
బద్ధతు లెఱిఁగిన - వారికిఁ గమల
వర్తనముం జూపి - నర్తన చలుపు
రంగ మండలి నటీ - రమణుల తోడ
వాని కంగములగు - వీణాదికములఁ

దోడుగాఁగొని పెక్కు - తోయంబులైన
పాటల నభ్యాస - పఱచు వారలకు
ననువుగా శ్రుతిఁగూర్చి - యనుగమించుచును
పాడి యనుభవించి - పదపడి తొలఁగఁ
ద్రోచిన కతన వే - దుఱు గొన్న కరణి
విరహవేదనచేత - వేఁగుచుఁ గూర్కు
లేక తన్మయతతో - లేమలు దిరుగ
ఫలము లేని విటుని - పసిఁడి వెలంది
యిచ్చగింపక కన్ను - లెఱ్ఱగాఁ జేసి
తెలిపిన యాసైఁగ - తెలియక యల్కఁ
గల్ల నిదురవోవు - కలుకులఁ బూల
పాన్పునందు విటులు - బతిమాలి తడవఁ,
బిల్లలతోఁ జేరి - వెసఁ బరుపెడుచు
నాడుచుఁ బిన్నతే - రీడిచి యలసి
పడకల నిదురించు - పంచాయుధ ధరు
లగు ముద్దుపిల్లల - కొగి ధాత్రిజనము
బడిసి ధూపమువైచి - వడి నిద్రపుచ్చ,
నీటి పులుంగులు - తోఁటపిట్టలును
పారువములును జి - హ్వాల నడంచుకొని
కౌతుకానందముల్ - కడవట్టి యుండఁ

జెలఁగు వాద్యములు క - న్నులు మూసియుండ
నూరి వారెల్లరుఁ - గూరుకునొందు
నడురేయి రాడ్భవ - నంబునఁ గంచు

పలకపైఁ గొట్టు గం - టల చప్పుడులును
వ్రతయుత నియతోప - వాస శ్రమమున
వినుతించి భగవానుఁ - బిలుచు పిల్పులును
పెద్దవీదుల సందు - వీదుల నగర
రక్షకుల తుడుము - రవమును మఱియు

కడలి తీరమున నౌ - కా వణిగ్వరులు
కలిపిన పలు రక - ముల యాసవములు
త్రావి మైమఱచి గీ - తమ్ములు పాడి
యార్చు కేకలును, వేఁ - పాకు తెల్లావ
లిడిన ధూపము కేలఁ - బడఁతులు వట్టి

పురుటింటి బాలెంత - పూవుఁ బోణులకు
* జలకంబు సేయించు - కలకలములును,
ధీరత్వమున్నట్టి - వైరులు లేమి
వీర వరేణ్యులు - చేరి యానగర
భూత చతుష్కముం - బూజలు సేసి

* బిడఁగన్న బాలెంతలు పదియవ నాఁటిరేయి కొలఁకున స్నానము చేయుట విధి. ఆప-గృహ్య-౧౫ ఖం ౨ సూ.

యవనీశునకు జయ - మగుఁ గాక యనుచు
బలులిచ్చి సేయు కే - కల చప్పుడులును
యువకులు బాలెంత - లుపిద లశక్త
బాలురు శూలార్తి - పడువారు పెద్ద
కుటుంబులు గలవారు - గురు మాంత్రికులును

మండప భూత మి - మ్మడి దయతోడ
నేతెంచి బలి గ్రహి - యించుఁ గాతమని
చేయు సందడులును - చెలఁగి యొండగుచు
ధ్వనియింప విని మదిఁ - దటమట పడుచుఁ
గటికి చీఁకటి నొంటి - గాఁ దోఁటనుండి

పడమటఁ గల చిన్న - వాకిలి త్రోవ
వెలలి దైవము ప్రేమఁ - దెలిపిన చక్ర
వాళంబు వాకిలి - పలువురు చొరఁగఁ
దీసి యుండఁగఁజొచ్చి - తెలవ యచ్చోటఁ
గ్రాలెడి లోకోప - కారికా మండ

పము చేరి తానొక్క - ప్రక్కనున్నంత
నట గొప్ప కంబంబు - నందు హేతువులు
చూప మయుఁడు చెక్కు - సుందర ప్రతిమ
సుతమతి భ్రమియించి - చోద్యంబునంద
దివ్యవాక్కుల తోడఁ - దెలవ కిట్లనియె

రవివర్మపుత్రి ! తు - రగసేన యొప్పు
దుర్జయుదేవి ! నీ - తోడి దా తార
చావ దుఃఖించి దం - తావళ మెదుటఁ
బడి ప్రాణములు బడి - వదలిన దాన !
చంపానగరమందు - సద్విజుఁడైన
కౌశికు కూఁతురా ! - కడఁక నీపురము
మారుత వేగుతోఁ - జేరి యక్కయగు
తారతోఁ గూడిన - పీరవై నట్టి
సుతమతీ ! విను పిన్న - సోదరి లక్ష్మి
నేఁటికి నేడవ - నాటి నిశీథ

మునుఁ దన పూర్వవ - ర్తనముతో నీదు
జన్మ వృత్తాంతంబు - చక్కన యెఱిఁగి
వచ్చు నంజకు మన - వనజాత నేత్ర
సుతమతి హృదయమ్ము - స్రుక్కుచు వడఁకఁ
గావలి వారలు - కను మూసి కూర్కు

మృదు తల్పముల కనుల్ - మిటియుచు నార్పు
సంకు లర్థము లేని - చప్పుడు సేయ
విజ్ఞు లర్థముతోడ - వేదముల్ చదువ
వారణ ఘటలు ఘీం - కారముల్ సేయఁ
గొక్కురు కోయంచుఁ - గోళ్ళు కూపెట్ట

గుజ్జుముల్ సకిలించి - కదులుచు నాడఁ
బులుఁగు లుచ్చావచ - ముగ రొదసేయఁ
గొంతల గాజుల - గలగలల్ లేవ
దేవతా బలులు సం - తృప్తిగ నడవఁ
గలవ మమ్మొడివారి - యలరుల పూజ

లలరారఁ జర్మ వా - ద్యమ్ముల శ్రుతులు
సొంపుగఁ గూరిచి - యింపుగ లేప
దాతల మొగసాలఁ - దగు ధాన్యరాసు
లతిశయింపఁగఁ బ్రాణి - తతి నిద్రలేపఁ
గారు చీఁకటి గుంపు - కడలకుఁ దోలఁ

గడలిలో నుండి య - ర్కుఁడు మొలతేర
నమ్మ్రవేటుంగొన్న - యాఁడు నెమ్మివలెఁ
బరితాపమందుచుఁ - బురమునఁ జొచ్చి
వీథి ప్రక్కనపోయి - వెలఁది మాధవికి
జరిగిన సంగతి - సరవిఁ దెల్పుటయు

మణిఁ గోలుపడిన జి - హ్మగమును బోలెఁ
దన కూఁతులేమికిఁ - దపియించి కుంది
మాధవి యటమట - మఱుఁగుచు నుండె
నుసుఱుల నీఁగిన - యొడలి కై వడిని
సుదతిని వీడిన - సుతమతియుండె.

## ౮. మణిపల్లవము

ఇచ్చట సుతమతి - యిట్లుండ నచట
మణిపల్లవమ్మున - వనధి తీరమున
నలలు మోఁదుచు నున్న - పొలమున యందు
సంకు పుర్వులు కెల - సంబున దున్న
ముత్తెముల్ పండిన - పొలమున యందు
పగడాలతో మంచి - యగురు గందంపుఁ
దరువుల దొరలించు - తరఁగలు పరవు
ధారణిఁ బులిగోరు - లారె పూవులును
విరిసి మొగలిపొదల్ - వికసిల్లి యడుసు
నందల్లి కలువ పూ - లందంద యెండి
తుమ్మెదల్ ఝుమ్మని - క్రమ్ముచునుండు
మదుఁగు దరిని మొల్ల - మల్లెలు పొన్న
పొగడలు పొలుచు గు - బురు జొంపములను
ఎండ చొరక పూవు - లెలరు పందిరిని
అలల మోఁదులఁజేరు - తెలి సైకతమున
పూల పడక యందు - పొసఁగ నిద్రించి
లేచి నెలఁత చెలు - ల్లేక చుట్టములు
లేని క్రొత్తగు చోట - మేను దాలిచిన
ప్రాణివలెను చెలిం - బరిచయ స్థలము
కానక కని యెఱుఁ - గని వానిఁగాంచి

జలధిలో నొక ప్రదే - శమ్మని తలంచి
తపనుండు పొడముడుఁ - దపియించి కాంచి
యుపవనంబున నిది - యొక భాగమేమొ ?
సుతమతీ ! యెందు డాఁ - గితివో యెఱుంగ
కలయొ ? విభ్రాంతియో ? - మెలఁకువ యొక్కొ ?
ఎడ నడుంకుచు నుండె - నెడరు గూర్చితివి
ఇదె యుంటినని ధైర్య - మీయవు వచ్చి
యూఱట గొను పలు - కొకటేని యనవు
తమము తొలంగె మా - ధవి యడలొందు
విడిచి యేగితివేమి ? - వెత మాన్ప ధర్మ
విద్దెలు నేర్చిన - విన్నాణివీవు
వంచన చేసితో ? - భయమందుచుంటి
నొంటిమైనని చెలి - యుమ్మలికింప
నలలలో నూఁగెడి - పులుఁగులు పరపు
టెక్కల పక్కలు - రేఁగు తుమ్మెదలు
వ్రాలి ముడిచి తేనె - గ్రోలు తేఁటులును
అంచపుం జోడయుఁడై - యట నలరారఁ
బలు రంగు లడరు ప - క్షులగమి యొకటఁ
బగతేంద్రు విడిసిన - పాళెంబుఁబోల
నలలతోడి జలంబు - కలయిక వలన

నెదురెదురై యొప్ప - నిసుక తిప్పలును
రేవు రేవుగ నెల్ల - రేవులు చుట్టి
తనవారిఁగానక - తపియించి కుంది
విరులు తుఱుము నెఱి - కురుచ్యముల్ చెదరి
వెనుక వ్రేలఁగ నట - విసువక తిరిగి

ఎలుఁగెత్తి పెద్దగాఁ - బిలిచి వేసరుచు
నెన్నవ లెన్ని పె - ల్లేడ్చుచుఁ దండ్రిఁ
దలఁచి మహిమ్నాబ్ధిఁ - దలరింపఁజేయు
దుష్ట కర్మము మిమ్ము - దూపిల్లఁజేయఁ
దల్లికన్నగి తోడఁ - దరలి కష్టించి

వేఱుదేశము చేరి - పెనుకత్తి చేతఁ
దెగి విహ్వాలించిన - దివ్యతేజస్వి !
ఓ యని పలవించు - చున్న, యాయయోధ్యయుఁ
దెసలకుఁ గాంతులు - దీపిల్లఁజేసి
భూస్థలిపయి మూఁడు - మూరలుం లేచి

దశహస్త పరిమితి - దశదిశలందు
శాస్త్రోక్తమైన సు - స్నాతిక వలయ
మేర్పడి మెల్పడ్డ - యెడఁ దమ్మిచదర
మలరి సర్వజ్ఞున - కమరిన యుచటఁ
దరులు వాసన లేని - విరుల నీయవ్వుచు

పులుఁగులు పలుకుచు - నలివు సేయవును
అమరేంద్రుఁ డుంచిన - యమ్మణి పీఠిఁ
గాంచు వారల పూర్వ - కర్మవృత్తముల
వారికిఁ దెలుపు ప్ర - భావంబు గలది
నాగలోకం బేలు - నాథ ద్వయంబు
ఒకచోటఁ బుట్టుట - యొకట వర్ధిలుట
చూడక తమపట్టు - వీడక వైర
వహ్ని యెదల రాఁజి - బలుపొంగ లెగయఁ
కనులు జేగుఱు గాఁగ - ఘనసేనఁ గొనుచు
ననిసేయఁ బూనిన - యానాఁడు మీరు
కినుకలు వీడుండు - కీడు వల్దనుచు
బుద్ధుండు బోధించు - పూత ధర్మముల
నుపదేశ మొనరుచు - నురు గుణనిధులు
పూజించు చుండిన - పుణ్యపీఠంబు
మణిమేఖలకుఁ గనం - బడియె నయ్యెడను.

### ౯. పూర్వజన్మ వృత్తాంతము

అటఁ బీఠముం గని - నంత నాచెలికిఁ
దెలియకయే కేలు - తలమీఁది కేగ
నానంద బాష్పంబు - లలర వెల్వడియె

ముమ్మాఱు వలగొని - మ్రొక్కి నుతించె
మొగులు తోడ మెఱుపు - పుడమికి దిగిన
పగిదిని సాష్టాంగ - పడి లేచి పూర్వ
జన్మవృత్త మెఱింగి - శయములు మొగిచి
* శుద్ధ తపస్వీ ! వి - శుద్ధ విజ్ఞాని !
♦ కాయగట్టను కొండ - కాలువ దరిని
నీవు పల్కిన దెల్ల - నిజమని యిపుడు
తమ మీఱఁగ నెఱిఁగితిఁ - దత్త్వ విత్తముఁడ !
గాంధార భూమి భా - గమ్మునఁ బూర్వ
భారమ్ము నీఁగఁగాఁ - బాలించు హస్తి
పతి బావమఱఁదియౌ - బ్రహ్మధర్ముండ !
రాజున కీవు పె - న్రాగంబుతోడ
ధర్మంబు బోధింపఁ - దగనేగి నేఁటి
కేడవ నాఁడు నీ - యిలయందు గొప్ప
భూకంప మొఘనష్టు - పొలుపేది నీదు
నగరంబు చెడిపడు - నాగలోకమునఁ
గాన నీ నగరంబుఁ - గడువడి వదలి

* బ్రహ్మధర్ముఁడను తపస్వి తనకు పూర్వము వినిపించినవియెల్ల నిప్పుడు తోఁచుటచే నతని సంబోధించి చెప్పుచున్నది.

♦ కాయంగరై - అనుదానికి తెనుఁగుచాయ.

వేయుచోటికిఁ బొమ్ము - పృథ్వీశ! యనుడు
నరపతి వెంటనే - నగరంబు వీడి
పసులతో నందఱు - బయలు దేఱుఁడని
యెఱిఁగించి సేనతో - ఋషభపురంబు
వదలి యవంతికిఁ - గదలుచు నడుమఁ

గాయగట్టు దరిని - గల విరిదోఁట
విడిసియుండ నచట - వీడు కూలుటను
విని విస్మయం బంది - మనుజ వరుండు
ప్రజలును వచ్చి నిక్క - బ్రణుతించి మ్రొక్కి
కరుణ ధర్మము నూని - కడుప్రేమలోక

నాశము తొలఁచు ది - వ్యమ్ముగఁ గడలి
ప్రోఁత వంటి రవళి - పౌనుపడకుండఁ
బగటు యశోధర - నగరమ్ము నేలు
రవివర్మ పట్టపు - రాణి పారాణి
యడుగులు శోభిల్లు - నమృత వతికిని

తనయనై శ్రీలక్ష్మి - యనఁగఁ బుట్టితిని
సిద్ధ పురేంద్రుండు - శ్రీధరు పుత్రి
మా సిపతికి భార్య - యగు నీలవతికిఁ
దనయుఁడై యుదయభా - నుని కిరణంబు
వలెఁబుట్టు రాహులు - వలచి పెండ్లాడి

## పూర్వజన్మ వృత్తాంతము

యతనితో నుద్యాన - మందుండి నీదు
పదముల సేవింపఁ - బదునాఱు నాళ్ళ
* దృష్టి విషంబను - దుష్టసర్పంబు
హరియించు రాహులు - ప్రాణమ్ము లప్పు
డతనితో విడ కీవు - నగ్నిఁ గూలుదువు

ఆవలఁ గతము ల - ట్లై యుంట వలనఁ
బుట్టెదు కావేరి - పూపట్టనమున
నీకొక గొప్ప యం - కిలి గల్గునాఁడు
మణిమేఖలాదేవి - మహితానుకంపఁ
గనఁబడి కటికి చీఁ - కటివేళ నిన్ను

గొనిపోయి యొకదీవిఁ - గనియందు విడుఁ
బాఁపరాజుల కామ - క్రోధముల్ ద్రోలఁచి
ధర్మ శ్రవము విచ్చి - కర్మశ్రవంబు
మూయించి భవపాశ - ముల్ద్రెంచు ధర్మ
ముపదేశ మొనరించు - నుఱునీతి కడకుఁ

బోయి కేల్మోడ్చి నీ - పూర్వ వృత్తాంత
మెఱిఁగి నేనిట నేఁడు - కఱపు నర్థంబు
జ్ఞప్తి గొందువనఁగఁ - జావు దుఃఖంబు
విని తలరిన మది - విభుని జన్మంబు

---

* దీని దృష్టింపబడిన వాఁడు మరణించును.

వినిపింపుమన నిన్ను - గొని తెచ్చువేల్పు ౬౦
పదపడి తోఁచి నీ - వల్లభుఁ డీతఁ
డని తెల్పి తట్టి వే - ల్పరయ రాదయ్యె
నని యేడ్చుచుండె న - మ్మణి మేఖలయును.

## ౧౦. మంత్రదానము

బుద్ధ పీఠిక యందు - పూర్వవృత్తంబు
మణిమేఖల యెఱింగె - మంచిదే యయ్యె
తాఁ బొందిన వరంబు - తగినదే యయ్యె
నని క్రొన్ననం గేలఁ - గొని మింటనుండి
పూలత దిగి భువి - బొలిచె ననంగ ౫
మణిమేఖలాదేవి - మహిఁ గాన వచ్చి
పూర్వజన్మజ్ఞాన - ముం బొంది నిలుచు
మణి మేఖల వినెడి - మాడ్కి నిట్లనియె
జీవులన్నియుఁ దెల్వి - చెడి ధర్మవిధులు
చెవిఁ జొరనీయక - క్షీణించు తఱిని ౧౦
తగవు నెప్పటి నిల్పఁ - దలపోసి యంత
నర్కుండు తాఁ బుట్టు - నట్టి కాలమందు
బాలార్కుఁ డొక్కండు - ప్రభవించె ననఁగ
నీవు జనించితి - నీ పాదములకు
సేవలు చేసితి - నీవయై యున్న ౧౫

యీ పీఠమందు నా - హృదయ మున్ంచితిని
శిరమునఁ దాల్చితి - విరులు చల్లితిని
తొడిఁబడు దుఃఖంబు - చెదరఁగాక యంటి
నని వలగొని పీఠ - మునకుఁ గేల్మోడ్చి
బంగరు లత యొండు - రంగార నిలకు
దిగి నిల్చెననఁ బోల్చు - దేవికి నెదుర
నిలిచి కై మోడ్చి నీ - నిండారు దయను
నాజన్మవృత్తంబు - నోజ నారసితి
నా భర్త యెచట ను - న్నాఁడొ తెల్పుదువె?
అనుటయు నద్దేవి - వినవమ్మ లక్ష్మి!
రాహులుతో నీవు - రాగంబు మీఱఁ
బూఁదోటలో నుండి - పొలయుల్కఁ గొంటి
వలపు వెల్లివిరియఁ - బతి సైఁప లేక
నీ పదములఁ బడి - నిను వేఁడు నంత
[1] సాధుచక్రుం [2] డభ్రి - సంచారి యాన

1. "ఓం మణి పద్మేహుం" అను మంత్రము వ్రాయఁబడిన లోహచక్రము కలవాఁడు. ఆ మంత్రమును జపించుచు దానిం ద్రిప్పుచుండుట బౌద్ధుల యాచారము. ఇయ్యది యిప్పుడు టిబెటునఁ గలదందురు. మంత్రజపఫలము నరకలోకముల దాఁటి నిర్వాణము చెందుట.

2. బౌద్ధులలో బుద్ధిపొందిన వా రాకాశసంచారులై యటనటఁగల బౌద్ధపీఠముల దర్శించి పక్వమనస్కుల కుపదేశము చేయుచుఁ గోరిన వారి కోరికలఁ దీర్చుట వారి యాచారము. అట్టి వారిని చారణులందురు.

లడుగంటఁ గోసిన - యతఁడు రత్నంపు
దీవిని ధర్మంబు - దీపింప నిలిచి
నాతఁడు మధ్యాహ్న - మందావనమున
దిగి కానఁబడ నీవు - దిగులొంది తబల !
మెత్త వడితి పుట్టె - మేన వడంకు
సిగ్గు వడితి నమ - స్కృతు లొనర్చితివి
అది గని రాహులుఁ - డా వచ్చువార
లెవరని కోపింప - నెఱుఁగంగ నీక
యతని నోటిని మూసి - యరుదుగా వచ్చు
పావనాత్ముల పాద - పంకజాతముల
ద్రొక్కి నుతింపక - మూఁగవై తేల ?
యని భర్తతోడ న - మ్మౌని పాదములకు
వినతిమైఁ గేల్మోడ్చి - వినుతించి దేవ !
మేము మీమది కెక్కు - మేటి శిష్యులము
కాక పోయిన నిటు - కై మోడ్చి వేఁడు
దాసుల కోర్కుల - దయసేయఁ దగరె ?
నీరు నన్నంబు నిం - పారంగఁ దెత్తు
భుజియించి మాసేవ - పూరింపుఁ డనుడు
నతఁడు సమ్మతిచూప - నర్మిలిఁ దెచ్చి
యిడితి నాతఁడు భుజి - యించి యనుగ్ర

హించిన పుణ్యము - దెల్పు నిన్వము ?
నీజన్మములఁ ద్రెంచి - నెగడును గాక
ఉపవనమున డాయు - నుదయుండె పూర్వ
భవమున రాహుల - ప్రభుఁ డిది నిజము
అతనిపైఁ బ్రేమ నీ - కగుట నైజంబ
యైనను తావి వ - ల్లవి యుప్పుడమునఁ
బడిన పోలిక యయ్యె - వనిత ! యిమ్యెడల
ధర్మమూలమగు చి - త్తము నీకు బట్ట
పడుటకై నేన యీ - పగిదిఁ జేసితిని
నీ యక్కలై మున్ను - నెగడిన తార
వీర యన్వారలు - పృథ్వీతలమున
కచ్చయ మేలు భూ - కాంతు దుర్గమున
కనుఁగు దేవేరులై - యలరిరి వారి
గూడి యాతఁడు కొండ - గుహలు వనములు
చుట్టి గంగాతీర - శోభన స్థలుల
వయ్యాళిరా నలు - వణ మునీశ్వరుఁడు
పరిశుద్ధ విజ్ఞాని - వచ్చి కన్పడుడు
సంభ్రమమున లేచి - చరణాబ్జములకు
నభివాదనము సేయ - నాది జినేంద్రుఁ
ధర్మమనుసరించు - తాత్పర్యయుతుఁడు

జన్మదుఃఖము నుండి - జనుల( దప్పించి
వైరంబు గలవారి - వాదంబు మాన్చి
మైత్రితో జీవులు - మనుఁగాక మనసు
కరుణచే నీరయి - కరఁగును గాక
యని దీవనలు చేసి - మును వెళ్లువారు
కని విన ధర్మంబు - కలుపంగ నెక్కు-
*కొండపై దోసంబు - క్రుంగించు నట్టి
పాద చిహ్నము లుంట( - బద పంకజగిరి
యను పేర నొప్పుకొం - డను వలగొనుచు
సేవింప వచ్చితిఁ - జిత్త శుద్ధిగాని
సేవింపు( డని వచిం - చిన యట్లువారు
తప్పక యేగి యు - త్సవము చేయించి
సేవించు భాగ్యానఁ - జెలి వారలిపుడు
మాధవివైమె సుత - మతి యయి నిన్ను
చేరిరి నీవు నీ - చిత్త కలంక
మీఁగితి తొలిబాము - నెఱిఁగితి ధర్మ
తత్త్వ మెఱిఁగి జ్ఞాన - తరణి చేకొంటి
తక్కిన మత ధర్మ - తత్త్వముల్ దెలుపు
వారలు తెల్ప నొ - ప్పఁగ వినఁగలవు
పలుధర్మ తత్త్వముల్ - పరికించి వినఁగ

* ఆ కొండ గృధ్రకూటము. అది మగధలో రాజగృహ సమీపమునఁ గలదు.

లే వయసుది మఱి - లేమ యంచెవరుఁ
జేర్చరు తత్త్వముల్ - చెప్పరు గాన
వలయు రూపము ధరిం - పం గగనమునఁ
జరియింప ననువయి - చను రెండు మంత్ర
ములఁ గొనుమని సేర్పి - పూర్ణిమయైన

♦ మంగళ దినము సా - మాన్య విజ్ఞాన
మున వెగటొంది యి - మ్ముల జతుస్సత్య
ముల నరసిన జ్ఞాని - బుద్ధుండు తపసి
చెప్పిన విధు లను - ష్ఠించుట సిద్ధ
మని నిశ్చయించిన - వనితవు నీవు

వీఱికిఁ గేల్మోడ్చి - వినుతించి యుంటి
వింక నీ పురమున - కేగెదు గాక
యని లేచి మఱియొండు - విను మది చెప్ప
మఱచితి మనుజుల - మయి కూటిలిప్ప
యీ మంత్ర మాఁకలి - యెనఁగ నీ కణఁచుఁ

గొనుమని యొసఁగి య - క్కొమరైన వేల్పు
తరుణి దీవించి యం - తర్ధానమందె.

---

♦ వైశాఖపూర్ణిమనాఁడు బుద్ధుఁడు జ్ఞానియయ్యెను కావున నా
డను మంగళదినము.

## ౧౧. పాత్రగ్రహణము

మణిమేఖలాదేవి - మఱుఁగైన పిదప
మణి పల్లవంబున - మణిమేఖలయును
తెల్లనైన యిసుక - తిప్పలు పూల
తోఁటలు చల్లని - తోయజాకరము
లానందముగఁ గాంచు - చాముందు నడవ
ద్వీప తిలక యను - దేవతా కన్య
కానంగ వచ్చి యో - కలికి! యెవ్వతవు ?
కలము పగులు నంతఁ - గడలిలోనుండి
యీఁది గట్టెక్కిన - యింతి నా నుంటి
వనుచు నయ్యమ యిట్టు - లను ధైర్యగాంది
యే జన్మమును గూర్చి - యీ వడిగితివో ?
పూర్వ జన్మంబున - భూపతి తనయు
రాహులు భార్యనై - రాజిల్లి లక్ష్మి
యను పేర ధారణి - నొప్పారు చుంటి
నీ జన్మమున వెల - యింతి మాధవికి
మణిమేఖలయను పే - రుంపుఁ గూఁతురను
దైవమిచట నన్ను - తెగడించి పోవ
నీ పీఠికడఁ బూర్వ - వృత్తమారసితి
నిచటికి వారాక - కిది కారణంబు
పొందిన ఫలమిది - పూఁబోఁడి యెవత

ఏ వనుటయు నా పెం - యీకీర్తి నవియే
నీ పూర్వజన్మంబు - నియతి నారసితి
నంతనమెయ్యె నో - చాన ! యిచ్చటికి
డాఁపునఁ గలదు ర - త్నద్వీప మనఁగ
నందు శమంత శై - లాగ్రంబు నందు
జినదేవు పదపద్మ - చిహ్నముల్ గలవు
తత భవజలధి నం - తరణమ్ము లతని
చరణముల్ వలగొని - సద్భక్తిఁ మ్రొక్కి
ప్రణుతించి యిచటికి - వచ్చితిఁ బూత
దర్శనీయమగు ర - త్నపుఁ బీఠ నిందు
న్నాజ్ఞఁ గాచెడిదాన - నతివ నాపేరు
ద్వీప తిలక యం్రదు - తిశిరి ధర్మేశు
నభ్యసత వచించి - నట్టి ధర్మములఁ
దప్పకొనర్చు ప్ర - తిష్ఠులు గాంచి
వినుతించి తమపూర్వ - వృత్తమారయుదు
రట్టిరె విన ధర్మ - మర్గామై యుండుఁ
బావన హృదయ ! యీ - బౌద్ధపీఠంబు
ముందరఁ గలువలు - నిందీవరములు
పద్మమ్ముల్ నిండిన - పరిశుద్ధ సరసి
గోముఖీయను పేరఁ - గొమరారునందు

సరవి వసంత వై - శాఖమాసమున
* నడిమి నక్షత్రమై - యడరు విశాఖ
తోడఁ జంద్రుఁడు కూడి - తోఁచు పున్నమను
బోధిసత్త్వుని జన్మ - పూత దినమున
మానుగ నేఁటేఁట - మీన లగ్నమున

మీన నిలయ మందు - కానంగ వచ్చు
గోపుత్రకుని చేతఁ - గొమరార నున్న
యమృత సురభియను - నరుదైన పాత్ర
మావేళ యీవేళ - యానాఁడె నేఁడు
రమ్మ నీ చేతికి - రావచ్చు నద్ది

* ఇప్పటి యిరువదేడింట నడిమిదిక్క చిత్రకాఁగా విశాఖ యెట్లగు నన, సంవత్సరమందలి రెండు విషువద్దినములలో మేషాయనమందు సూర్యున కెందు ప్రవేశము కలదో యది మొదటిదిక్కాగా నెన్నుట జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతమగుట వలనను పూర్వమొకతటి సూర్యుని కృత్తికాప్రవేశవేళ మేషాయనము కలిగెననియు దానింబట్టి కృత్తికను మొదటి నక్షత్రముగా నెన్నుచు వచ్చిరనియుఁ బూర్వ జ్యోతిశ్శాస్త్ర గ్రంథములందు తెలియవచ్చుటచే విశాఖ మధ్యనక్షత్రమనుట దోసము కాదు

కృష్ణయజుర్వేద సంహితవలనను కృష్ణయజుర్వేద బ్రాహ్మణము వలనను కృత్తికయే మొదటిదని తెలియుచున్నది. విక్రమాదిత్యుని సభానవరత్నములలో ప్రసిద్ధజ్యోతిర్విదుఁడగు వరాహమిహిరుఁడు తన కాలమున మేషాయనమం దశ్వినీ నక్షత్రముండుట యెఱింగి తత్పూర్వపద్ధతికి మాఱుగా అశ్వినినుండి యెంచు పద్ధతి నేర్పఱచుటచే నిప్పుడిట్లున్నది.

అందుండి కురియు జీ-వౌషధ మరయ
నఱచేతి నొప్పించి - తఱుఁగక వచ్చు
నమ్మాయి! మీయూర - నలరు నఱవణ
ఋషియొద్ద దీని మ-హిమ విందుగాక
యని యామె పలుక న-మ్మణి మేఖలయును

వలపున మణిపీఠి - వలగొని వ్రొక్కి
ద్వీప తిలక తోడఁ - దెరువున నరిగి
గోముఖి వలగొని- గుఱికొని నిలువఁ
బాత్రంబు లేచి య-వ్వనిత యంజలిని
నిలుచుటయును - చెలి నెమ్మనమందు

మితిలేని ముదమున - మీఱి పెల్లుబ్బి
మారుని గెల్చిన - వీర పదములు
చెడు త్రోవ చెడుపగ - చెఱుచు పాదములు
తగ నుపదేశించు - తలిరు పాదములు
స్వర్గంబు గోరని- ప్రణుత పాదములు

తలఁపులు వెనుబడ - నిలుచు పాదములు
కన్నులొసంగు స-త్కరుణా పదములు
చెడుపల్కులు వినని - చెవుల పాదములు
నయము సత్యము నిల్పు-నాల్క పాదములు
నరకులు వగచెడ - నడచు పాదములు

అరుహుల చింతల - నడఁచు పాదములు
అట్టి నీ పదముల - కడఁగుట దక్క
దీవింప నానాల్క - తివ్రురదు సత్య
మని వినుతించు న - మ్మణిమేఖలకును
బోధి నీడను దోఁచు - నాథుపాదములు

తనివితీఱ నుతించి తద్ద్వీప తిలక
యిట్లను నాఁకలి - యిలునడిఁ జెఱుచు
గౌరవమును చంపుఁ - గైకొన్న విద్య
యను నావను పగుల్చు - నరుడైన తొడవు
సిగ్గును వదలించుఁ - జెఱుచుఁ గీరితిని

సుందరులై యొప్పు - సుదతుల వెనుక
నిలుపు నాఁకలియను - బలు పిశాచమ్ముఁ
దఱిమిన వారిఁ గీ - ర్తనము సేయుంగ
నానాల్క కంత వి - న్నాణంబు లేదు
ధరణి వేఁడిమి నిండఁ - దరువు లెండంగఁ

బాగ లెగయ రగులు - నగివి పైకొనంగఁ
బ్రాణులు మడియ వ - ర్షము పడకున్న
విశ్వపాలన చెడ - వేద విమండు
స్వర్గమర్త్యంబులఁ - జనఁ జాలువాఁడు
గాటంపు టాఁకలి కాల్చి పీడింప

నార్చు వైరవులేక - యలయుచు సొలసి
తిరుగు విశ్వామిత్ర - దివ్యతపస్వి
కుక్క మాంసము గాంచి - కూర్మి వేల్పులకు
నొప్పించి తినఁగ నా - హుతి సేయువాని
యెదుటఁ బర్జన్యుండు - పదటునఁ దోఁచి

వర్షంబు కురియంగఁ - బంటలు పండె
జీవులు సుఖయించెఁ - జెలఁగె లోకములు
కఱవు నోరుచు శక్తి - గల ధనికులకుఁ
బెట్టువారు తగవు - వెల కట్టువారు
ఓరువలేకుండు - నురు దరిద్రులకుఁ

గలుగు పేరాఁకలిఁ - దొలఁగించు వారు
ధర్మమార్గమ్మునఁ - దనరారు సౌఖ్య
మయ జీవితము నురా - లయ మందు కడపు
వారలు బీదల - నారసి యన్న
మిడువార లన్నంబు - నిడువారకారు

ప్రాణంబుల నొసంగు - వారలు చుమ్ము
అట్టి జీవిత దాన - మను దృఢవ్రతము
పూని సన్మార్గంబు - బుద్ధి నారసితి
వనుటయుఁ దొలిపుట్టు - వున నేను వలచు
చెలువుండు పాముచే - జీవము ల్వీడ

నేనగ్గిఁ జొచ్చు ము - న్నెండలో నలసి
వచ్చిన సాధున - కిచ్చి కుడ్చినది
యరసితిఁ గలలోని - యర్థంబువోలె
నాఫలమ్మగ జీవ - నౌషధమైన
పాత్రమ్మ చేతికి - వచ్చి నిల్చినది

తగ విత్తి ఫలియించు - ధర్మఫలమ్మ
కుడుచు ధనికు లిండ్ల - కడనిల్చువారు
కడుపును జఠరాగ్ని - కాల్పఁ బేలికలు
కట్టి మానముదాఁచి - కండలు కరఁగ
నెండఁగాంచక వాన - నెంచక యేగి

తల వాకిటను నిల్చి - తలరుచుఁ బూర్వ
పాపమ్మచేఁ దాప - పడువారు వారిఁ
గన్నఁగొడుకు మోముఁ - గాంచి తపించి
పాలు కురియు తల్లి - వక్షోజ మట్లు
కోరిన యప్పుడు - కోరిన యంత

జీవామృతము దయ - చేయు పాత్రమునఁ
దపియించు మోములఁ - దనివి నిండంగ
నలరారుచోఁ గాంచ - నాస గల్గెడిని
అన, దాని వృత్తాంత - మరసితి వీవు
ధర్మమ్మసాక్షిగా - దయను వర్ణించి

కుడుపు పుణ్యాలకై తాఁ - గూరియుఁ బాత్రమ్ము
మఱవకు మింటనుండి - మరలుము యనఁగఁ
దెఱవ మిన్నయు ద్వీప - తిలక పాదముల
కెఱఁగి యాపాత్రము - మృదుల హస్తమునఁ
దాల్చి మణిపీఠి - దర్శించి మ్రొక్కి
మింటికి కెగసె మణి - మేఖల యంత
దైవము పల్కు స - ప్తమ దినమిద్ది
తనయ యింకను రాదు - తప్పెనో యనుచు
వనరుచు నుండిన - వారల యెదుర
దిగి వారి కలఁతలఁ - దీర్చి వారలకు
నద్భుత మగు లీల - ననియె నాబాల
రవివర్మపుత్రి ! దు - ర్జయుదేవి ! యమృత
వతి గర్భమునఁ బుట్టి - హిత లక్షణలగుచుఁ
దారమై వీరయై - తనరిన మీకు
మ్రొక్కెద మీగలి - బొంది యుండఁగనె
తాపముల్ తలఁగించు - తపముసేయంగ
నఱవణమహానీంద్రు - నంఘ్రిపద్మముల
కడ నుపదేశ మం - దుఁడు మార్గమదియు
పసిపట్టికై యమృ - త సురభి యిద్ది
దీనికి మీర ల - క్షించి మ్రొక్కుండు
అన వారు మ్రొక్కిరి - ముని పదములను
శరణొంద లెంచెడనఁ - జేరి మువ్వురును.

## ౧౨. అఱవణముని సేవనము

ఇట వారు చనుచు మ - హాముని యెచట
వఱల్గు సంచరయుచు - నఱముది వేను
తలరని నాలుక - గలుగు నఱవణ
ముని వసియించు ని - మ్మును చేరి ముగురు
ముమ్మఱు వలగొని - ముని పాదములకు

వందన మొనరించి - భక్తిం గేల్మోడ్చి
సుకుమారి యుపవనిం - జొచ్చుట యుదయుం
డచటికి వచ్చి తా - న్నాడిన పలుకు
మణిమేఖలాదేవి - మణిపల్లవమున
వదలుట యటంబీరి - వలనం దొల్బాము

పొలుపు నెఱు గంగాం - బూర్వ నాథుండై
యుదయ కుమారుండై - యుదయించుట యును
అక్కలై యుండిన - యల తార వీర
దుష్కర్మమున మృతి - దొరసి మాధవిగ
సుతమతిగాం జనిం - చుటయును దెలిపి

నియమముల్ పూని స - న్నిధి వినుమనుచు
మూండు మంత్రమ్ములు - ముదమున నేర్పి
మణిమేఖలాదేవి - మఱుంగగు నంత

ద్వీప తిలక కాని - పించి చేరుటయు
గోపుత్రకుని బిచ్చ - కోర నిప్పించు
టయు దానికత ముని - దాపున వినుమ
యనుచుఁ బొమ్మనఁ దాను - చనుదెంచుటయును
నియతుని పాద స - న్నిధి విన్నవింప
విని మహాముని యిట్లు - వివరింపఁ దొడఁగె
తనివి సనని ప్రేమ - తల ఋూటి సన్న
వనితల నడవడి - వలనొప్ప వినుము
నీకు దైవ మెఱుఁగ - నిగదించు నాళ్లు
చనిన పిదప మఱు - జన్మంబుఁ దొలఁచు
జిత మూరు చరణాబ్జ - చిహ్నంబు లున్న
పాద పంకజగిరిఁ - బరికింపఁ జనుచుఁ
గచ్ఛయమేలు భూ - కాంతు దుర్జయుని
విరితోఁటఁగోఁ గాంచి - ధరణీశ చంద్ర !
నీవు నీదేవులు - నెమ్మి నున్నారె ?
యన రాజు కళవళ - మంది చింతించి
మైరేయ పాన వి - మత్తత వీర
మే నెఱుంగక క్రొత్త - యేనుఁగు నెమరఁ
జని చచ్చుటను విని - వసరుచుఁ దార
మేడ యెక్కి దుమికి - మృతిఁజెందె ననుచు

వినిపింప విధికృత - మున కిట్లు వగవ
వలదని యీయాట - పలికి లేచితిని

ఆట వెలందుల - యాభరణముల
మాఱువలె వేఱు - వేఱు భూషణము
లిత్తఱిఁ దాల్చి వ - చ్చితిరో యటంచు
మణిమేఖల యెదుట - మాధవి సుతమ
తుల చరిత్ర మతఁడు - తెలిపియుఁ దృప్తి

పనక యిట్లను జన్మ - సంగతుల్ ధర్మ
పద్ధతుల్ క్రమముగఁ - బరికించి తెలియు
కన్యకా! వేడ్క తోఁ - గడఁకతో వినుము
ధర్మప్రభుని మహో - ద్యత్కృతఁ దెలుపు
సద్ధర్మములు వృద్ధిఁ - జనక నిర్వాణ
పథము గతికయును - పల్లేరు పెరిఁగి
మాయఁగఁబడి దోష - ములనుండి కలుగు
దుర్గతి వాకిలి - దోఁచె విస్తృతిగ
జీవులు చనుదారి - చిర శుద్ధ మయ్యె
గొడ్డుమంచు కవిసి - కత్తుక నుంచు
మిహిర మండలముండు - వహ్నిని దోఁచినది
కాని యింపు వెలుంగు - కాన రాదయ్యె
సినప సలాక చొ - చ్చిన మణి త్రోవ

నబ్ధి పోవద మైన - నాత్రోవఁజొచ్చి
సన్నని జలధార - సరణి సన్మార్గ

మనుసరించుచు నుండె - జనమునఁ గొంత
నాయుపదేశమ్ము - నర్మిలి వినర
యియ్యది మర్త్యుల - యెఱుఁగమి గానఁ
జక్రవాళంబునఁ - జను వేల్పులెల్ల
దుఃఖించి గుమిగూడి - తుషితలోకమున

* మహాదేవు పదముల - మన్నించి యొఱఁగి
గాఢాంధకారమ్ము - క్రమ్మ జగమున
బాలసూర్యుఁడు తోఁచు - పగిదిని ♦ వేయి
నాఱు నూఱుల పది - యాఱవయేఁట
బుద్ధదేవుఁడు భూమిఁ - బొడమ నాపిదప

గురు సరస్సునఁ బిన్న - పరివాహమందు
గొప్ప వెల్లువచొచ్చు - కొమరునఁ జిన్న
చెవి త్రోవ సద్ధర్మ - సిద్ధాంత విషయ
ముల్లాస కరమగు - నుత్సుకత్వమున
జీవింపఁగాఁజొచ్చుఁ - జిత్ర భానుండు

---

* ఇతని పేరు ప్రభాపాలుఁడు.

♦ ఇది యేశకమో తెలియరాదు.

కలిగిన తఱిఁ దన - కాంతులఁ జూపు
మణివోలెఁ గటికి త - మంబు నిండారు
హృదయ మాలిన్యంబు - చెదరి పర్విడఁగ
బుద్ధరవి పొడమిఁ - బొడమ ప్రభాత
వేళ రవీందులు - వెసఁ బ్రసన్నులయి

విలసిల్లునురు ఋతు - వితతి క్రమమ్ము
ననుసరింపఁగ మొగు - లనువుగఁ గురియ
భూమి సుభిక్షమై - పాలు పొందుచుండఁ
గార్శ్య దేహములు దుః - ఖము లొందకుండఁ
గరువలి వలగొని - తిరుగుచు నుండఁ

గొండలు ఫలముల - నిండారుచుండు
నుదధి పెక్కనయమ్ము - లొసఁగుచు నుండు
గోవులు క్రేపుల - కుం ద్రావనిచ్చి
పాత్రముల్ నిండఁగాఁ - బాఁడి యొసఁగుఁ
బులుఁగులు తృప్తిమై - నెలవుల నుండు

మృగములు మనుజులు - పగమానియుండ్రు
నరక పిశాచ గ - ణములు సుఖించుఁ
గుంటి మూఁగ చెవిటి - గూనియు గ్రుడ్డి
మృగరూపములు నవి - మృత్యుకారిణియు
నవివేకమును బ్రాణు - లంద వానాఁటఁ

ప్రభవించు వారు ధ-ర్మము విన్నవారు
కలు దుఃఖ జీవిక-కడచినవారు
బోధిమూలంబు చేరు-నాథుని పాద
జలజముల్ దొసఁగులు-తొలఁగఁ గీర్తనము
మఱవంగఁ జాల జ-న్మము జన్మమందు

ఇట నీవలనఁ గల్గు-హేతు సంఘటన
లున్నవి పెక్కులు-వ్యోవరిన పిదపఁ
గాక నీ బోధనల్-కలుకులు వినరు
ముప్పొ లడఁచు నాది-మూలుని పాద
పంకజగిరిఁ గా చి-ప్రణుతించినట్టి

వార లగుటచేత-వీరు నీతోడ
మహిమచే నున్నతి-మాన్యంబు నైన
మారజితుని పాద-వారిజములకు
వలగొని కేల్మోడ్చి-ప్రణుతించి కర్మ
పాశమ్ముల న్నీఁగి-పరిపూతమైన

సద్గతి పడయఁగఁ-జాలినవారు
సమయని జీవనో-షధము నొసంగు
నమృత సురభిఁ గేల-నందితి వీవు
మర్త్యుల కేని య-మర్త్యుల కేని
గొద తీర్చుటయె కడు-గొప్ప ధర్మమని

యురుతర సిద్ధాంత - మొక్కటే కలదు
కార్చిచ్చువంటి యాఁ - కలి బాధ తీర్ప
శక్తవు నీవని - సత్తపస్వి యన
మణిమేఖల కొసఁగె - మహితపాత్రమును.

### ౧౩. గోపుత్రక వృత్తాంతము

అమృత సురభి యను - నక్షయపాత్ర
గొని మీకు దయసేయు - గోపుత్త్రు చరిత
వినుఁడు వారాణసి - విప్రుఁ డధ్యాప
కుం డభంజను డాని - కొమ్మ శాలియను
పాఱుత ధర్మంబు - మీఱి పాలునకు
గూర్చిన యపనింద - కుం దగు దండ
నమునకు భీతిల్లి - కుమరి తీర్థమున
నీరాడఁబోవుచు - నిండు చూలాలు
కావునఁ గూరుకు - కటికి చీఁకటిని
కనిన బిడ్డను గాంచి - కరుణ వోనాడి
విడిసిన యొకతోఁట - విడిచిపోయినది
బిడ్డ పాలకు నేడ్వ - విని యొక్కయావు
బాలకు కడకేగి - పాలు ప్రేమమునఁ
గుడిపి మై నాల్కతోఁ - దడవి దుఃఖంబు
దొలఁగించి యేడు నా - ళ్లలమి రక్షింప

వయసనగోడను । గాను - వాసి పాఱుంచు
* యువభూతి పసిపాప - యుమ్మలంబు విని
కలఁగు మదిన్వచ్చి - కన్నీరు నించి
యితఁడు గోపుత్రకుఁ - డెట్లగు నాదు
తనయుఁడే యని మది - తమకంబు మీఱి

దనకు ననుగ్రహిం - చిన వేలుపునకుఁ
జేమొత్తి మ్రొక్కి యా - చిఱుత నెత్తికొని
మనకు బిడ్డగఁ గె - మన వంశ మింక
వర్ధిల్లఁగలదని - పాఱుండు పిదప
జాతకర్మాదులు - జరపి పోషించి

వడుగు చేయించి ప్రాఁ - బలుకు లంగమ్ము
లధిగమింపఁగఁజేసి - యవనీ సురులకు
వలసిన యవినేర్పి - వఱలుచున్నంత
నొక్కనాఁ డయ్యార - నొక విప్రునింట
మాంస మాహుతిసేయు - మఖమునయందు

కొమ్ములఁ బూవుల - కొమరొందు పశువు
తన కబ్బు దుర్దశఁ - దలఁచి దుఃఖించి
యంబాయనుచు బోద - నం బొనరించి

---

* ఇత్థంభూతి యనుటకు సంస్కృతీకరణము.

కాంగ్రస్తులై యొప్పు - మృగయుల వలను
తగులువడిన జింక - వగిదిఁ దపించి

పిలుచు పిల్పున, గుండి - యలు నీరుగాఁగఁ
బలవించి నే దొంగ - పనిచేసియైన
దీని మరణబాధ - దీర్తుఁగాకనుచు
గోపుత్రకుఁడు రేయి - గోవును గొనుచు
గ్రామమ్ము దాఁటి మా - ర్గము దప్పి యొక్క -

పలుకు తాల్పరవిన - పథమందు నిలిచి
యున్న తఱిని దయ - యొక యింతలేని
కటికి డెందముగల - ఘనులతోఁగూడి
విప్రుండు వెదకుచు - వెసఁ జనుదెంచి
గోపుత్రకుని పట్టు - కొని వానిఁ గాంచి

గోవును క్రొంద్రోవఁ - గొనిపోవఁజూచు
నీవు చోరుండవు - కావేని యేల
చావఁదెచ్చితి విట్లు - చండాల పుత్ర!
కుల సంఘమున నిన్ను - వెలి వేసెదమని
కశలతో మోఁది య - గ్గలిక బాధించు

నవనీ సురుల నుపా - ధ్యాయు నాయావు
కొమ్ములఁబొడిచి ప్రే - గులు వెలికీడ్చి
యడవిత్రోవను గంతు - లిడుచుఁ బాఱుడును

గోపుత్రకుఁడు వారిఁ - గూర్చి యిట్లనియె
బాధించు టేల నా - పలుకులు వినుఁడు

గోవులు తమ యంతఁ - గుంభిని మొలచు
కసవు మేయుచు జీవ - గణములకెల్ల
మేలైన తన తియ్య - పాలను ధర్మ
బుద్ధితోఁ గరుణతో - బూనికఁ గురిసి
త్రాగించు పీసిచేఁ - దనరిన పెదుగు

కలదేని వృద్ధ వి - ప్రులు తెల్పుఁడనఁగఁ
గాంచన నేమి చ - క్రము కుడిచేతఁ
దాల్చిన వెన్నని - తనయుండు మనకు
దయచేయు గొప్ప వే - దముల యర్థంబు
నెఱుఁగక యిటు తిర - స్కృతిచేసి నగితి

పదటంపు పెద పిన్న - వాఁడవు నిక్క-
మూఁబని కుట్టుఁడ - వనఁ దగియుంటి
విప్రసుతుండ నె - వ్విధమునఁ గావ
యని గేలి చేయంగ - నాతఁ డిట్లనియె
నచలుండు పశుపుత్రుఁ - డగుఁ గాఁడ యేమి

జింక కొడుకు కాఁడె - శృంగి ధారణిని
పులికొడుకై కదా - పుట్టె విరించి

కీర్తి పాత్రుండైన - కేశ కంబళుఁడు *
గొప్ప వినుతిగనె - గోమాయు కొడుకు
అల వసిష్ఠుఁడు వేశ్య - యందుద్భవించె

బెస్త పిల్లకుఁబుట్టి - పెరిఁగె వ్యాసుండు
వీరు మీకుల పూర్వ - వీరులు కారె ?
వినుతి మీచే నేఁడు - గొనుచుండలేదె ?
అగుచో శ్రుతులయందు - నాగమములను
సద్గ్రంథములఁ బశు - సంతతి యగుచు

వచ్చిన యొకచెడు - వంశమ్ము గలదె ?
యనఁగ నందొక విప్రుఁ - డనియె నీరీతి
వీని జన్మంబు నే - వివరింతు వినుఁడు
త్రోవ నడచు శ్రమ - తో నొక్క విప్ర
వనిత మున్నుకుమారి - పదములఁ గొలువ

నొంటిమైవచ్చిన - యువతిని గాంచి
యెవ్వరి దానవీ - వేల వచ్చితివి
యూరేది యన నామె - యుమ్మలికించి
వారాణసిని ఘన - పారి యన్ కీర్తి
నలరు నభంజనుఁ - డను పాఱు సతిని

* అసిత కేశ కంబళుఁడని యొక పేరు బౌద్ధగ్రంథములందు కానంబడుచున్నది.

శాలిని యనుదానఁ - జపల చిత్తమున
విప్రులకుం గాని - పెడ త్రోవ నేగి
పతి వీడి దండన - భయమున నూరు
వీడి కుమరి తీర్థ - మాడంగఁ బోవు
జనములతోఁ గూడి - చనుచుండి పాండ్య
రాజధానియగు కొ - ఱ్కాను దాఁటి గొల్ల
పల్లియ కడ బిడ్డఁ - బ్రసవించి కరుణ
తోడ నినుఁగు నొక్క - తోఁటలో విడిచి
వచ్చితి నిట్టి దు - ర్భగ నైన నాకు
సుగతి యనఁగ నొక్క - చొప్పును గలదె?
యని ప్రలాపించిన - దాయప కొడుకు
వీఁడు వీనిని గూర్చి - వివరించి ఫలము
గలదె యంచింతకుఁ - దెలుపకుండితిని
కూళ వ్రాత్యుఁడు చం - డాల పుత్రుండు
కుండుం డితనిఁ దాఁక - కుండన్న యంతఁ
జిఱునవ్వు నవ్వి యాఁ - జిఱుతఁ డిట్లనియె
పాఱులు వచ్చిన - వంశక్రమమ్ము
వినుఁడు మొట్టమొదటి - వేలుపు మొదటఁ
గన్న తిలోత్తమా - గణికకుఁ బుట్టు
నిరువురు బాలకు - లీ విప్రకులము

మొదటి వారలు వారె - మొకట జందెమ్ము
దాల్చినవారు స - త్యమ్ము వచించు
*శాలి ద్రోహిణి యన - సాహసి చిరి
అనినవ విప్రులా - తనికి నుత్తరము
నొసఁగలేక కినిసి - యువభూతిఁగోడఁ
దెలుప నాతఁడు నెఱి - దెలిసియు నూరి
పగభరింపఁగలేక - పట్టిఁబో ద్రోచె
యువభూతి విడువంగ - నూరివారలును
పసిగ్రుచ్చుచు వానిఁ, బాధించుచుఁ వలును
నూరూరు తిరియుచు - నుంచఁ బాఱుతలు
పాత్రలోపల రాలు - పడవైన విసిగి
ధనికులు వసియించు - దక్షిణా మధుర
కరిగి సరస్వతి - యాలయమునకు
ముందరి మండప - మున వసియించి
యూర భిక్షాపాత్ర - మూని నిర్దుష్ట
పద్ధతిఁ దిరిసి యా - వచ్చినవాని
గ్రుడ్డివారు చెవిటి - కుంటివారలును
వ్యాధి బాధలనొందు - వారగతికులు
నందఱు రండు రం - డని పిల్చి పెట్టి
శేషమ్ము తాను భు - జించి పాత్రమ్ము
దిండుగాఁ గొనుచుఁ బ - ఱుండి నిద్రించుఁ
బ్రాణి కోటికి నార్త - రక్షకుండతఁడు.

* శాలియన నతని తల్లి పేరు.

## ౧౪. పాత్ర మహిమము

ఆతని కొక్క నాఁ - డమ్మండపమున
సంఘటించిన చిత్ర - చరితమ్ము వినుఁడు
నడురేయి కొందఱు - తడిసి వర్షమునఁ
జీకటిఁబడి త్రోవ - చెడి తూలిపడుచు
మండపమున నిద్ర - నుండు నా భిక్షుఁ
బొగసి పుణ్యాత్మ! క - డ్పులఁ గాల్చుచున్న
యాఁకలిచేఁ జావ - నయ్యె నిప్డనుడు
భిక్షాన్నమే తక్క - వేఱొండు లేని
గోపుత్రకుఁడు వారి - గోద తీర్చు వెరవు
గానక తపియింపఁ - గాంచి పవిత్ర
సర్వమతస్థ స - జ్జననుతపాత్ర
సత్కళాలయ సర - స్వతిదేవి సుప్ర
సన్నమై నిలిచి యో - సద్భక్త తిలక!
చింతింపకుము లేచి - చేకొను మిద్ది
దేశంబు క్షామ బా - ధితమైన వట్టి
పోవదిం దక్షయ - జీవనౌషధము
కొనువారి చేయి నొ - చ్చును గాని లోటు
పడని దియ్యది యని - పడిఁ జేతి పాత్ర
మాతనిచేఁబెట్ట - నతఁడు కేల్మోగిచి
ఆఱని దీపమా - అమరాధినేత్రి

ప్రాణి కోటికిఁ జెల్వ - పరఁగించు తల్లి !
ఆపద లరసి మ - మ్మాదుకోవమ్మ
యని మ్రొక్కి - వారల - యాపద దీర్చి
యా దినమ్మున నుండి - యాఁకలి నొచ్చి
వచ్చి యన్నను గొను - వారి కే ల్లొసఁవ్వ
జీవులఁ గాచుచుఁ - జెలఁగుచునుండ
మనుజులు మృగములు - మఱి పక్షి వితతి
తమ జాతివైరముల్ - తలఁగంగఁ ద్రోచి
పండిన మ్రాఁకునఁ - బక్షుల మాడ్కి
నొద్దికతోఁ జేరి - యోరెమ్మి గొనుచు
వచ్చువారలు పోవు - వారలు నగుచు
నెడవడకుండ సం - దడి సేయుచుండ
నిచట నీజగమున - నీతని చర్య
క్రతు భుగింద్రుని * పాండు - కంబళాసనము
జలియింపఁ జేయఁ జం - చలమైన నడక
తోడ మూఁడవ కాలి - తో నేలనూని
వంగిన మొగల - పాటుఁడై యింద్రుఁ
డీ లోక జీవుల - నింపారఁ గాచు

* భూలోకమున బౌద్ధులకేదేని యాపదసంభవించిన నింద్రుని పాండు కంబళాసనము చలించును. ఆ సంజ్ఞ యెఱిఁగి వచ్చి వరములిచ్చి వారి కొఱఁతలఁ దీర్చుట యింద్రుని విధి (చూ ౨౫-వ ప్రక.)

గోపుత్రు నెదుట సం-కోచించి నిలిచి
యింద్రుఁడ వచ్చితి-నిటకు నీయుద్దేశ
మేమి? దానఫలమ్ము-నిత్తుఁ గై కొనుము
నాకమ్ము నకు రమ్ము-నంగ నా బోడ
పక పక మని వెన్న-ముక విఱుఁగంగ
నవ్వి కేరడము నొ-నర్చెఁ బొమ్మనియె
నిచ్చటి పున్నెంబు-నచ్చటఁ గుడుపు
వేలుపుల్ ధర్మమ్ము-విధిఁ జనువారు
నాపద వేళల-నాదు కొన్నారు
తపము శ్రమలకోర్చి-తగఁ జేయువారు
భవ బంధములను త్రెం-పఁగఁ బూనువారు
విదకిన లేని యా-విబుధ లోకమున
కధిపతివైన సు-రాధ్యక్ష! వినుము
కష్టించి యలసి యాఁ-కలిగొని వచ్చు
వారి యాఁకలి దీర్పఁ-దేటిన నవ్వొ
మోములఁ జూపు నా-ముద్దు పాత్రమ్ము
కడుపు నిచ్చును గద-యుడుపు నిచ్చుఁగద
పెండ్లము కద మఱి-విభుఁడు రక్షకుఁడు
సర్వమ్ము నీయుంగఁ-జాలిము యుండ
నింక నీవేమి నా-కిత్తువో చెపుము

యనుటయు జీవుల - నరసి రక్షించు
వాని పాత్రము కోరు - వారలు లేక
వ్యర్థమౌ కరణిని - వాసవుం డపుడు
వాన దండిగఁ బడి - పంటలు పండి
తిరిపగాండ్రకు భూమిఁ - గఱవగు నట్లు
గోపుత్రకుని మీఁది - కోపంబు వలన
మేదిని జనులకు - మేలు సేయంగ
వరుసఁ బండ్రెండేండ్లు - పాండ్యుని భూమి
వానలు కురియక పంటలు లేక
జీవుల మరణింపఁ - జేసిన కఱవు
భూమి చల్లఁబడఁగ - భూజనములకుఁ
బనులు గలుగ దండి - పంటలు పండి
యాఁకలి దప్పులే - యరయని రీతి
యేర్పడ నన్నంబు - నిడు మండపమునఁ
బలు విధముల రవ - ములు గుడుగుప్పు
మని నిల్వ విటులు ధూ - ర్తావలి నటులు
పరిహాసకులు తెరు - వరులు మున్నైన
వారలు ముదమునఁ - జేరి నెత్తముల
వ్యర్థ భాషణముల - వర్ధిల్లు నంత
మండపమున గోసు - తుం డుండ లేక

వదలి యూరూరును - పల్లె పల్లెయును
తిరిగి తిరిపగాండ్ర - నరయుచు నడిగి
యెవ్వఁ డీతండని - యెల్లరు నవ్వఁ
బరులానఁ గనునాస - పడిన యాతండు
నీవుంటివా యని - నిలిచి ప్రశ్నించు
వారు లేని కతాన - వఱలు సంపదలు
నుదధి కొల్లగొనఁగ - నొంటిమైవచ్చు
మహీపతివలె నొంటి - మైవచ్చు నతని
యెదురఁ గడలి నావ - నింపుమై దిగిన
వారలు మ్రొక్కి * శ్రా - వక దేశమందు
వాన లేమిని చచ్చెఁ - బ్రాణి వితాన
మధికమ్ముగా నన - నమరేంద్రు కరుణ
చే భుజించెడి వారు - చిక్కని కతన
కన్యక ముదిసిన - కరణి వ్యర్థముగ
నున్న పాత్రము కేల - నూని యేనచటి
కరుగుటయే మంచి - దని నిశ్చయించి
కదలి యాత్రికులతోఁ - గలమున నెక్కి
చనుచుండ నొకట ను - ప్పెనలేచి జలధి
నల్ల కల్లోలమ్ము - నడరింపఁ గాంచి
పడవను మణిపల్ల - వము తీరమంచు

* జావా.

నిలిపి నేఁడిట నిల్చి - వెలలుద మనుచు
మాలిమి యన, గోకు - మారుండు దిగియె

సగము రేయిని గాలి - ప్రగ్గిన యంత
నందఱు రండని - యట నుండి పడవఁ
గదలించుకొని యార - కాటి చన్నంత
దీవిఁ గాంచెడి వేడ్క - తివుర గోపుత్రుఁ
డరిగి యావలి నాఁడు - మరలి వీక్షించి

పడవ లేమికిఁ జాలఁ - బరితాప మంది
మణి పల్లవంబున - మను జీవి యొండు
లేమిఁ బ్రాణులఁ గావ - లేమికి వగచి
పాత్రమ్ము నను గాచు - మాత్రానకోర్వ
లేను తపః ఫల - మైన యీపాత్ర

వ్యర్థమగుట కోర్చి - బ్రతుకంగఁజాల
బ్రతికి మోచుచునుండ - ఫలమేమి యనుచు
బ్రొక్కి విసుగున గో - ముఖుఁ బొఱవైచి
యేఁడాది కొకనాఁ - డిందు కన్పడుచు
కరుణతో జీవులఁ - గాచు వ్రతమ్ము

కలవారు రా వారి - కడఁజేరు మనుచు
నిరశన వ్రతమూని - నియతిమై నుండి
ప్రాణమ్ము వీడు నాఁ - డాతని కడకు

నే నేగి యెట్లయ్యొ - నెట్టి వారలకు
నని ప్రశ్న సేయంగఁ - దనకు ఘటిల్లు
పలు దుఃఖముల నాకుఁ - దెలిపి మైవిడిచెఁ
దొలు దెసఁ బుట్టి యు - రులఁ బోవఁ దఱిమి
మలుదెసఁ గ్రుంకిన - మార్తాండుఁబోలె
మణి పల్లవమ్మున - మట్టి ఘటమ్మ
వదలి తనివి లేమిఁ - బ్రాణులఁగాచు
తలఁపుతో శ్రావక - ధారణి నేలు
భూమి చంద్రునినాటఁ - బొలుపారు నొక్క
గోగర్భమునఁబుట్టె - గోపుత్రకుండు.

---

## ౧౫. బిచ్చమున కేగుట

కన్నకా! యీనాళ్ళఁ - గనుగందుఁగాచు
నావు తత్పుణ్యాన - శ్రావక దేశ
మందు ధవళగిరి - ప్రాంత ధారణిని
పూన్కిఁ దపించు మృ - ణ్మఖుని యాశ్ర
మమ్మున బంగరు - కొమ్ములు గిట్ట
లొప్పు నాదూడయై - యుదయించి యెల్ల
వారు ప్రేమింపఁగ - వర్ధిలి చూలు
గొను మున్నె చనుఁబాలు - గురిసి జీవులకుఁ

ద్రావించుచుండ నా - తపస్త్రికాల
వేది తత్త్వజ్ఞుండు - పీత మోహుండు
కాంచి యీ యూఁబసి - గర్భంబునందు
వర్షంబు కురియించి - ప్రాణులఁగాచు
రక్షకుఁ డుదితుఁడై - రాజిల్లు నతఁడు
ఆంత్రమాలలు దాల్చు - నట్టిఁడు కాఁడు
బంగరు గ్రుడ్డునఁ - బ్రభవిల్లు వాఁడు
అనియు నవ్వల వ్యాధు - లాధులు లేక
జనియించి పాడిమైఁ - జరియించి తుదిని
మణిపల్లవమ్మున - మనుజదేహమ్ము
వదలినాతఁడు దయా - వంతుండు పశువు
నే యెల్లవేళల - నెదనెంచు కతన
జనులు 'యాం తేమతిః - సాగతి' యనెడి
పలుకు ఫలింపంగఁ - బశు గర్భమందు
దేవతా గణము మో - దింప లోకంబు
వినుతింప జగతికి - వెల తెల్వరాని
తోడవుగఁ బుట్టె బు - ద్ధుఁడు తోఁచినట్టి
విరి మాధవమ్మున - వృషభమాసమున
పదుమూఁడు దినము ల - వధి చన్న పిదప
మీన నక్షత్రాన - మీన లగ్నమునఁ

బోధిసత్త్వుఁడు భూమిఁ - బుట్టిన నాఁడు
కలిగిన శుభ సూచ - కములతోఁ బుట్టె
ధరణి మబ్బులు లేక - విరివాన గురిసె
బుద్ధుండు పొడమిన - పుణ్యదినమ్ము
కాకున్న నట్టి మం - గళ నిమిత్తములఁ
గనుచుంటి మనుచు న - క్కజమంది చక్ర
వాళంబునం గల - పరమతాపసులు
కంబ పతిమఁగాంచి - కనుఁగొందమంచు
నారేయి చీకటి - యదనఁ జేరంగ
మణిపల్లవమ్మున - మైవీడి నతఁడు
జీవరత్నణ తృప్తి - చెలఁగిన కతన
శ్రావక దేశాన - జనియించె నతని
కత యఱవణముని - కనిన వాఁడనుచు
నానాలుకకు నొప్పి - పూనిచె నవల
భూతలేశ్వరుఁడగు - భూమి చంద్రుండు
మృణ్మ్మఖపాద నీ - రేజ ద్వయమున
కెరఁగి సద్భక్తిమై - నే నపుత్రకుఁడఁ
దమదయచే నపు - త్రకుఁడ నైతి నని
గోపుత్రకుని క్షేమఁ - గొని పోయి పెంచె
రాజ్యంబు సత్య వర్ధక మయ్యె నతఁడు

శ్రావక ప్రభుఁడయ్యె - జనము మోదింప
నింద్రునకుం దృప్తి - యొసఁగమి నేమొ
ధర్మప్రభుఁడు నీతి - దప్పెనో యేమొ
కావేరినది దండి - గాఁ బాఱుచున్న
పంటలు పండక - ప్రాణివర్గమ్ము
తగు తిండి లేక యె - ద్దడిని తపించె
మణిమేఖలా! క్షీర - వనధి యొసంగు
నమృతంబు వేలుపు - లాని శేషంబు
వాఁడని వడువున - వఱపైన చోటఁ
గష్టముల్ దొలఁచు న - క్షయపాత్ర మొదవ
కుండుట తగదని - యోగీశుఁ డనుడుఁ
దల్లులఁగోడఁ ద - త్తనయ యమ్మౌని
పదముల కెఱఁగి యా - పాత్ర చేపట్టి
బిచ్చగత్తియ పోల్కి - వేసంబునూని
చనుదేరఁగా గొల్లు - మను సద్దుతోడ
విటులు ధూర్తులు పిన్న - పెద్దలు కాంచి
మున్ను వత్సేశుఁడు - మోసంబువలనఁ
జెఱవడ విడిపింప - స్థిర చిత్తుఁడగుచుఁ
జలచిత్తుమాడ్కి ను - జ్జయిని దిరుగు
బ్రహ్మసుందరయోగి - పట్టి యాగంధ

రాయణుఁడూను వి - భ్రాంతవేషమ్ముఁ
గని యౌర్వశిక తపించు - జనముల కరణి
నుదయ కుమారకుఁ - డెద దాఁచినట్టి
మణిమేఖల సమస్త - మనుజులు కాంచఁ
దిరిపబోఁకిని కేల - ధరియించి రాఁగఁ
జూచి యచ్చెరువని - స్రుక్కి చింతించి
దూపిల్లి నొవ్వ నా - త్రోవ వెంబడిని
జంగమ సుమలత - బంగరుబొమ్మ
మాధవి పుత్రి స - మ్మతి దిటవేడ్క
మహిఁ బతివ్రతలు ప్రే - మమ్మున నిచ్చు
భిక్షంబు తొలుదొల్త - మచ్చికఁగొనుట
తగుననఁ గొలఁకు తో - డుగు తమ్మిలందు
కమల వసించు మే - ల్కమలమ్ము భంగి
నిల్లాంద్ర మేటిదై - యొసఁగిన యూర్ధ్వి
యిల్లిది చొరఁదగు - దిచ్చటి కలివ!
తగ నుత్తరమున వి - ద్యాధర నగర
మునఁబుట్టి దక్షిణ - మ్మున మలయమ్మున
నొకయేటి గట్టున - నొక మహా తపసి
కొక నొవ్వి గలిగించి - యొక శాపమంది
కట్టోర్వరాని యాఁ - కలి నొవ్వినొంది

పరితాపమందుచుఁ - దిరుగుచున్న
కాయ చండికయును - కాంతను నేను

---

## ౧౬. ఆర్ద్రి బిచ్చమిడుట

* ఆదిర చరిత వ్యా - ఖ్యానింతు వినుము
సాధ్వి యాయమ భర్త - సాధువణి వాఁడు
తగవును విడనాడి - తరుణిని వీడి
ధననారి వలఁబడి - దాని కూఁడుదిని
నెఱదంట యనుపేర - నెగడి జూదమున
ద్రవ్యమ్ము వెచ్చించి - తద్వ్యయమ్మునను
వండలు గలుగుచు - వలచిన వేశ్య
తక్కిన వారును - తఱుముటవలనఁ
జే విడుచ్చుకొని ము - చ్చిరుచు యోచించి
వంగదేశమ్మొగు - వణిజులఁగూడి
కడలిఁ జనుచునుండ - సుడిగాలివలన
సుడివడి పడవయుఁ - జెడి వడి మునుఁగ
నౌక విఱిగిన కఱ్ఱ - నూఁతగఁ గొనుచు
నీఁదుచుఁ దరఁగలు - మోఁదఁగ నేగి
నగ్నచారు లయిన - నాగు లున్నట్టి

---

* ఆర్ద్రాశబ్దభవము

కొండ ప్రక్కంజేరి - యుండెనాతండు
పడవ పగులఁ దన - వలె గట్టుచేరు
వారూరు చేరి యా - పడవ మునుంగఁ
జచ్చినవారితోఁ - జచ్చె సాధువన
విని యార్ద్రిదుఃఖించి - విలపించి యంతఁ
గాటఁ జల్లముత్రవ్వి - కట్టెలు పేర్చి
యనలంబు దరికొల్పి - తన పతి కర్మ
వశమునఁ జేరిన - పదము చేర్పుమని
యనలుని ప్రార్థించి - యగ్నిలో దుముక
వేసిన పడకయు - మూసిన కనవు
కాలక పూసిన - గంధమ్ము చెడక
పూసరముల సొల్పు - సొలివోకయుండ
నిందీవరస్థ యా - నిందిరవోలెఁ
బాగయి కుండఁగ ని - ప్పును కాల్పలేని
దుర్భగ నేనెట్లు - దోరుదు ననుచుఁ
గొంతెత్తి యేడ్వ నో - కోమలీ! వినుము
నీ భర్త కెరటముల్ - నెట్టంగ నేగి
నక్నచారణులగు - నాగులున్నట్టి
కొండను చేరి నాఁ - డుండఁ డచ్చోటఁ
జాలకాలము దాఁకఁ - జంద్రదత్తుండను

వణిజునితోఁ గూడి - వచ్చి నిన్జేరు
నీ దుఃఖమును వీడు - నీరజాక్షి యని
యొక వాక్కు వినఁగఁ గా - టుక కంటి నీరు
కాఱనేడ్చుట మాని - కలికి నీరాడి
చింతవిడిచి యిల్లు - సేరి నా భర్త
వడివచ్చుఁ గాకని - వ్రతము లొనర్చి
శరదమ్మ కరియు నా - శ్చర్య చర్యగల
పతి రతలును మ్రొక్క - భవ్యాత్మయయ్యె
నచట నాయమ భర్త - యంభోధి దరిని
గిరి క్రింద నొక తరు - వరమూలమందు
కడలి నీఁదిన పెను - బడలికవలన
నొడలు మఱచి కూర్క - నొందిన యంత
నాగిరి వసియించు - నాగులు నియమ
మరయని మోఱకు - లందు నిద్రించు
నాతనిఁ గని డాసి - యాతండు మిగుల
నలసి నాఁడొంటరి - యై వచ్చినాఁడు
వీని క్రొవ్విన మేను - విందు నేఁడనుచు
వాని నిద్దుర లేప - వారల నొడువు
నరసులు లేకాడ - నేర్చిన వాఁడు
కావున నా క్రూర - కర్ములు డాల

నిలిచి గారవమారఁ - బలికిరి మాకు
గురుఁ డొకండు గలండు - జరగుద మటకు
నన వారితోఁ జని - యట మద్యఘటము
లధిక దుర్గంధమ్ము - లగు కళకుట్ల
సరముల కడఁ జెను - కరములతోడఁ

దన పెంటితోఁ గూడి - తనరు నెలుంగు
కరణినుండిన నాగ - గురు సౌరు గాంచి
వాఙ్మధురిమను వాని - వశపఱచుకొని
చెలిమి చేసి ని పెం - జెట్టు క్రీనీడఁ
గూర్చున్న పిదప నా - గురుఁడు నీవిటకు

వచ్చు కారణమేమి - వాక్రువ్వు మనఁగ
నీతఁ డంబుధిఁ బడ్డ - యుగచాట్లుఁ దెలుప
నీరు తిండియు లేక - వారిధి నీఁది
యలసి నాతఁడిః గాన - నన్నంబు నీరు
కల్లు మాంసము తోడఁ - గలికి నొక్కర్తు

నిండన నదివిని - యొదవడి నిలిచి
సాదువు దోష వ - చస్సులు వింటి
వలదన నాతండు - వడఁటిని తిండి
వదలిన ధరణిపై - ఫలవంత మేది
కలదు ? కలిగెనేని - తెలుపుమ యనుచుఁ

గినిసి పలుక సాదు - వనియె నీరీతిఁ
జెడుకల్లు నానుట - జీవ వధమును
నిష్కల్మషులు బుధుల్ - నిందించినారు
పుట్టినవారలు - గిట్టు చుండుటయు
గిట్టినవారలు - పుట్టు చుండుటయు

నిదుర మెలంకువ - వదురగు నిజము
సద్ధర్మమొనరించు - జనములు పుణ్య
జగము లొందుటయు దు - ష్కర్మముల్ సేయు
వారలు నరకానఁ - బడుటయు నిక్క
మని యెఱింగిన విజ్ఞు - లవి వలదనిరి

అన వికటంబుగా - హాసంబు చేసి
మరణించు జీవులు - మైగొని మరల
జనియించు నని వచిం - చినది నిక్కంబ
యేని యాజీవ మే - మైనానఁ బోయి
వేఱుదేహంబొందు - నారసి విశద

రీతి మాకిట వివ - రింపుమ యనుడు
సాదు విట్లను నీర - సము లేక వినుము
జరుగుచున్నది కాంచి - యరయంగఁదగుదు
వొడలిలో నీజీవుఁ - డుండ వేఱొక్క
మేను జీవుఁడు పొంద - దానిని నటుకె

యగ్గివెట్టిన నది - యరయదు కాన
నొడలిని వీడిన - దొండున్న దనుచుఁ
దెలిసిన నీవు త - ద్దేహి చరించి
విడియ నొండొక చోటు - పడయుట నేన
కాదెల్ల వారలు - కని యెఱుంగుదురు

దేహ మిచ్చుట నుండ - దేహి పెందవ్వ
చేరుట కలయందు - నారయుచుందు
వెటకేని యీ జీవుఁ - డేగి చేయుటయుఁ
దన దేహమునఁ జొచ్చి - తాఱుచుండుటయు
నరయుము యని సాదు - కరుణాతోఁ దెలుపఁ

క్రూరదృష్టుల నాగ - గురుఁ డాలకించి
బాగు నెఱిఁగి సెట్టి - పదనుల వ్రాలి
కల్లు మాంసము వీడి - కాయంబులోని
జీవుఁ గావఁగఁజాల - జీవికావధియుఁ
దను యనుభవమైన - దారియుఁ దెలిపి

సద్ధర్మములు మాకు - సరవిఁ జెప్పుమన
నతఁడు బాగుగఁ బలి - కితి విది వినుము
సన్మార్గమున నెప్డు - జరుగుము నీకుఁ
దెలియు మార్గం బున - కెఱింతు వినుము
పగులు కలముఁబోలు - పాప మైకొఱకు

పలుప్రాణులను హింస - పఱచుట మాను
వారు సాయపడి కా - పాడుచుందురు
ముదిసి నైజంబుగ - ముగియు జీవులను
నడుమనే చంపుట - న్యాయ్యంబు కాదు
ఏ ప్రాణి యొకనేని - హింస వీడుమన

మావల్ల నైనంత - మట్టు ధర్మంబు
సలుపువారము నీకు - వలయు వస్తువులు
వలసినంత కొనుము - కలముల ముంచి
నరులఁ దింటిమి వారి - నగలు ధనమ్ము
లట రాసులై యుండె - నగురు చందనము

కుప్పలు తిప్పలై - కోఱలుఁ గై కొనుము
యని యొప్పగించెఁ జే - కొని యతఁడుండి
చంద్రదత్తుం డనఁ - జను వణిజుండు
వంగ దేశమునకు - రంగార నేగు
తరణిలో నెక్కి యా - పురమునఁ జేరి

యా యమతోఁ గూడి - యిష్టభోగములఁ
బొందుచు బహుదాన - ములు సేయుచున్న
వాఁడట్టి యార్ద్రి చే - వదలు బిచ్చంబు
కొను మన లోనికి - మణిమేఖల చని
మాటలాడని ప్రతి - మంబోలె నిలువ

నాదిక కని వచ్చి - యంజలి చేసి
వలగొని వింతల - వలఁ దెగఁగోసి
యున్న యక్షయము పాత్ర - మొగి నిండి మితము
ముట్ట నాఁకలి నొవ్విఁ - పొనుఁగుఁ గాకయుచు
నార్ద్ర గౌరవమున - నన్నంబు నిడియె.

---

## ౧౭. మండపము చేరుట

పతి భక్తి చేతి యా - పంచిన భిక్ష
కొన్న పాత్రంబున - యన్నంపుటుండ
ధర్మ సంపాదిత - ధనరాశి ధగ్మ
తన త్రోవ వాడిన - యనువున నామె
చేకొను వారల - చేతులు నొవ్వ
జీవులు సంతృప్తి - చెందుచుండుటయుఁ
బాత్రాన్న మబికెడి - పగిదిని గాంచి
యేనుఁగు తీపుచే - నెదఁ గుందుచున్న
కాయ చండిక నమ - స్కారమ్ము చేసి
పర్వత నారదుల్ - పదరి తామిడిన
శాపంబుచే హారి - స్వస్థత చెడఁగఁ
బుడమిని జనియించి - కడలి బంధించు
పట్టునఁ గ్రోఁతులు - పడవైచు గొప్ప.

యద్రులు జలధిలో - నడఁగిన రీతి
నిడిన యన్నంబుచే - నడఁగని వట్టు
టాఁకలి పూర్వ కృ - తాపరాధమునఁ
బొందితినో యన్న - పూర్ణ ! నాబాధ
నడఁగింపుమా యని - యర్థించి మ్రొక్క
చేతి పాత్రము నిండి - చేకొన్న యన్న
మామె చేతం బెట్టు - నంత భుజించి
యెన్నండు నాఁటని - యెడరు నాఁకలియుఁ
బోనుపడ మణిమేఖ - లను వినుతించి
యనియె విద్యాధర - జనలోకమందు
కాంచన పురమొండు - గలదందు వెలయు
దానను దుర్విధి - తలఁబట్టిత్రోవ
భర్తతో మలయంబు - పరికించు నాస
నరుదెంచి సెలయేటి - దరినున్న యిసుక
తిప్పపై నొకచోటఁ - దిరుగుచునుండ
జందెంబు తిరులైన - జడలు వల్కలము
చెలఁగిన వాఁడు వృ - శ్చికుఁడను తపసి
తాటి పండంత నే - రేటి పండొండు
టుకు నందుంచి యే - టికి నాడఁబోయె
దుర్విధి ప్రేరేప - గర్వంబుతోడ

నీల్గుచుఁ బోయి వా-నిని కాలఁదన్ని
చిదచిదఁ జిదియంగఁ-జేసితిఁ దపసి

తిను వేడ్క వచ్చి నా-తీరును గాంచె
నలఁగిన పండును-నన్నును గాంచె
నఱకాలి మంట చె-చ్చెఱ నెత్తికెక్క
నీ పండు దివ్యమై-యెసఁగుఁ బండ్రెండు
వత్సరమ్ముల కొక్క-పరి యొండు పండు

దీనిని దిను వారు-తిరుగఁ బండ్రెండు
వత్సరముల దాఁకఁ-బసి నొందఁబోరు
మూన్నాలుగేండ్లకు-మొగి నొక్కమాఱు
భుజియించు వ్రతమును-పూనిన వాఁడ
నా భుజించెడి పండు-నలఁచితి విట్లు

మగువ! గగన చర-మంత్రంబు చెడఁగ
నేనుఁగు తీపుచే-నిడుముల నొంది
పదియు రెండేండ్లకుఁ-బండెడు పండు
నేఁ దిన్న మీఁదట-నీ గొద యుడుగుఁ
బొమ్మని యమ్మౌని-గ్రమ్మన నొసఁగు

శాప మిన్నాళ్లకు-పముసె నీ వలన
గొదఁగుంది యమ్మౌని-కుంజరుఁ డేగ
మలయంబు గను వేడ్క-మాని వీడితిమి

ఆత్రంపుఁ జెయిదికి - నంకిలి నొంది
మద్భర్త చింతించి - మఱి దైవగతికి
వగచి ఫలంబేమి ? - వగవంగఁ దెచ్చి
కొంటి వియ్యది లెమ్మ - యింటికి ననిన
మంత్రంబు మఱచితి - నాంత్రముం గలఁచు
బాధ మిక్కుటము మయ్యెఁ - బసి పెల్లురేఁగ
భరియింపఁ జాల దు - ర్భరమయ్యె నంటేఁ
గాయ లాకులు పండ్లు - కందముల్ దెచ్చి
యిచ్చిన నాఁకలి - యీఁగద బాధ
దుస్సహ మగుడు నా - తోడ నాభర్త
ద్రవిడ దేశమ్మున స్థి - రంబైన లక్ష్మి
కలవార లనుకంప - గల వార లబల
బీదల పాలిటి - పెన్నిధానములు
అనదల పాలిటి - యమర ద్రుమములు
పొలుపారు కావేరి - పూంపట్టణమునఁ
గలరు పెక్కు దినాలు - కడచననిమ్ము
నడచి యే చనియందు - కష్టమ్ము గడుపు
పతి యిట్లు పల్కఁగ నే - వసియింతు నిచట
నింద్రోత్సవ దినాల - నేతెంచి భర్త
నను విచారించుచు - నా బాధ కడచుఁ

గడువు లెక్కిడుచు రాఁ - గల యేట దీఱు
నని చెప్పె నిరుడు నేఁ - డట్టులే యయ్యె
నాగొంద దీర్చితి - నతు లివే నీకు
నింకఁ గాంచన పురి - కేగెదు. దాన
భవ దుఃఖములఁ బాపు - పావన మౌని
వరులు పల్వురు చక్ర - వాళానఁ గలరు
ఎల్లవారలు వచ్చి - యేగుట కొఱకు
వాకిలి తెఱవంగఁ - బడియుండు సతము
ధర్మమండప మొప్పు - తనరారు చుండు
నట నెంద ఱెందఱో - యాఁకటఁ గుందు
వారు తీఱని నొవ్వి - పడువార లిడెడి
వారుంటచేఁ జేరు - వా రట కేగు
మని కాయ చండిక - యరిగిన యంత
మేడ వీథిని మణి - మేఖల యొక్క
ప్రక్కనొదిఁగి పోయి - వలగొని మ్రొక్కి
యమ్మండపం బెక్కి - యందొక్క యోర
నిలిచి యందలివారు - పలువురు మ్రొక్కి
పొగడు చంపావతి - పొలుచు కోవెలకుఁ
ద్రికరణశుద్ధిగఁ - దెలచి యెల్లరకుఁ
బూర్వకారణము తె - ల్పుచు నుండు కంబ

పతిమను వినుతించి - భాను తాపమునఁ
బొనుపడు నడవికి - ముంగారు వాన
కొమరున నాఁకటఁ - గుందుచున్నట్టి
జనులకుఁ జేతి యు - త్తమ పాత్రఁజూపి
గోపుత్రకుని చేతఁ - గొఱలు పాత్రమిది
ఆఁకలి గొన్న వా - రందఱు రండు
రండనఁ జని యోగి - శము గొనువారు
తిను వార లిడునది - విని వచ్చువారు
చేయు కల కలమ్ము - చెలరేఁగె నచట.



## ౧౮. ఉదయుఁడు మండపము చేరుట

అది విని పుంటిలో - నగ్గి నెఱ్ఱనగు
బల్లెమ్ము చొనిపిన - పగిదిఁ దపించు
నుల్లంబు నందలి - యెల్లను మీఱు
నెఁజిలితో లోన - నిలుకడ చెడిన
యలమట తోడ నూ - ర్పులు పుచ్చిలేచి
యీ వ్రత ధర్మమ్ము - నీటు గావింతు
ననుచుఁ జిత్రాపతి - యాట వెలఁదుల
కిట్లనుఁ గోపలుఁ - డీల్గిన పిదపఁ

దత దుఃఖమంది మా - ధవి మునిపల్లె
చేరుట నవ్వుల - చేటయ్యె మనకు
నీ గొప్పపురమున - నిది తగునెడి
విజ్ఞానులకు నాట - వెలఁది పతివ్ర
తాత్వమనంగ ను - దాహరణమ్ము
పరిహాస పాత్రమై - పరిఢవిల్లినది
ప్రియుఁ డాపదం బొంద - వీడని యమునలు
తోనేడ్చి చల్లని - తోయంబునందు
మునుఁగు వారికరణిఁ - బోగ లేక ముందు
చితిలో దుముకు కుల - స్త్రీల కై వడిని
పతిరతలము కాము - పైఁడి కాంతలము
పలువుర చేతి కూ - డెలమి భుజించి
వైణికుం డిలుగఁ న - వ్వానితోఁ బోక
నిలుచు వీణియవంటి - నెలఁతలము కద !
మధువున్న వేళ న - మ్మతి నాని ఫలము
వఱలని మొడఁ బూల - వదలు తుమ్మెదల
వంటి వారము కర్మ - ఫలము తీఱు తఱిఁ
బద్మాలయను పోలు - వారము మనము
పురుషులు చేపేడఁ - బొగులుచు ననద
వేస మూనుట లోక - విదురులు నవ్వ

మెయివడిగద మణి - మేఖల యనెడి
లతిక పుష్పించు కా - లముఁ బ్రతీక్షించు
న దయ కుమారుఁడన్ - గొదమ భృంగమ్ము
విమలమౌ హృదయమ్ము - వేడ్క వహింప
వికసించి నట్టి క్రొ - వ్విరి చేతఁగొన్న
పాత్ర తిరిప గాంఢ్ర - పాలు గావించి
యుదయుని తేరిపై - యువతి నెక్కింప
నేని * యింటిక రాల - నేడింటి నెత్తి
నెత్తించుకొని రంగ - మిమ్ముగఁ జుట్టి
నిందనొంద బ్రదుకు - నీచంపు లంజ
నై యాట వెలఁదుల - హళాస్థు మేడలకుఁ
బోనని శపథంబు - బూనితి ననుచు
నెదనుండి పైనుపొగ - లెగయంగ నూర్చి
బూమె పల్కుల నొక - పోల్కి నూఱడిలి
వెలఁదులు కొందఱు - వెంబడి రాఁగఁ
జెమట బొట్టులు నేనఁ - బొటమరింపంగ
నగరి వీదిని కాలి - నడకతో నరిగి
యుదయుఁ డుండిన యెడ - కొదుఁగుచు డాసి
రొదసేయుచున్న తు - మ్మెదలును తేంట్లు

---

* వ్యభిచరించిన వారి నెత్తిపై ఏడు కొలిస యిటుక రాలుంచి ఊరు చుట్టించి వదలుట పూర్వకాలపు దండనము.

ముసరుచుండెడి పోఁత-యిసుకపై నొక్క
ప్రక్క బంగరుగోడ-పగడంపుఁ గంబ
ములతోడ నొప్పిన-ముత్యాల చవికఁ
జిత్ర వితానమ్ము-జిగు లీనుచుండ
స్ఫటిక కాంతుల యలల్-పరవు మంచమునఁ
బరిశుద్ధ పుష్ప త-ల్పమ్మునను౦డి
యలల పోలి విరిసి-యొలయు చామరలఁ
దరుణులుగొని యిరు-దరి నిల్చి వీవ
నుదుటున నొప్పారు-నుదయుని పాద
ములకడ నిల్చి కే-ల్మోడ్చి జయమ్ము
పలుక నాఁడు రవ-మ్ములు కొంత తెలియ
మందహాసముఁజేసి-మాధవితోడ
మణిమేఖలయు నొందు-ఘాని వేషములు
దోసము లేనిదై-తోఁతెంచు నవియె ?
యన నది యిట్లను-నరుదైన పరువు
మాలతి లక్ష్మీంద్ర-గాణి కాంచి ప్రాచె
నిల భరతమ్మునఁ-గలకంఠరవము
నెమ్మి నృత్యమ్ము గని-నెమ్మది చెంద
భ్రమర ముదయవేళ-బరికింపదేల ?
యని వేగ వచ్చితి-సంధ్యా దీపారా

మననంబు కడనుండె - మండపమందు
'విజయీభవ' యటంచు - వెలఁది పల్కంగఁ
గలము చెడినతఱిఁ - గడలిలో మంచి
పడవ దొరకు రీతి - పరిభవిల్లంగ
నుదయుండు ముదమంది - ముదిత కిట్లనియె
స్ఫటిక మండపమున - జానైన క్రొత్త
ప్రతిమ చిత్రమనఁగ - వదలితి మున్ను
కై కట్టు కడు నొత్తెఁ - గఠిన స్తనములఁ
బగడంపు బిగిమీఱి - జగడాలు గొలుపు
ముత్యాల కోవలో - మొలచిన యమృత
కాంతుల నానంగఁ - గాంతు దలిర్చు
నలుపుతేకుల కలు - వల వెక్కసెట్టి
బల్లెముం గెలిచిన - నల్లని మీలు
లేవఁ దెలివి వేఱు - త్రోవయ్యెఁ దనకు
నని చెవిలోఁజెప్పు - నట్టి యందంబు
షటిక గీమునఁ గావఁ - బడినట్టి ప్రతిమ
నాయుల్లమున దాఁగి - నన్ను రక్షించె
నదు రేయి యటనుండ - నా యెట్టయెదుట
బంగరు కళుకుల - పనిమీఱు వేసు
గలమూర్తి నిలిచి చ - క్కటి దెల్పి తపము

వలచిన కన్యక - పైఁగల వలపు
మఱతు గాక నే నామె - మరులు దయ్యెమ్మొ!
వేలుపో? యెఱుఁగను - విభ్రమపడితి

నని యుదయుఁడు పల్క - నమ్మది ముదిత
చిఱు నగవూని యో - చిన్ని మారాజ!
ఆ చింత విడుము కా - మాసవ మాని
మత్తుచేఁ జేయు ను - న్మాద చేష్టితము
లెన్నియో వేల్పుల - యెడను పెక్కయ్యె

గౌతము భార్యపైఁ - గామంబు గొన్న
యమరాధిపతి సహ - స్రాక్షుఁడై నదియుఁ
బ్రాలేయగిరి శర - వణ మందు సప్త
ఋషుల భార్యలను మో - హించిన యగ్ని
కాతని దార స్వా - హాదేవి తత్త
దుచిత రూపమ్ములు - నొంది స్వభర్త
మక్కువ దీర్చుట - మఱచితి వేమి?
ప్రభువుల కన్నె కా - వలి పెండ్లి పిదపఁ
గావలి పతిచావఁ - గావలి నెఱిని
గాంచి పరులు పరుల్ - గానంగ నీక
యుంచు నాతఁడుగాక - యొగి వేలుపులును
సమ్మతింపని కుల - సతుల వంశమునఁ

బుట్టిన యదికాదు - భూజనుల్ కాంచ
రంగమెక్కి - తనదు - రంగంగు చూపి
ఆటల పాటల - హాసు గావ్పించి ౧౧౦

చెఱకు తుంటల విల్లు - చిఱుదేంటి యల్లె
పువ్వుటమ్ము లొకై దు - మొగ్గ కటారి
నంగజుండెత్త వా - లుం గన్నులనెడి
యీడుపు వలపైచి - యీడ్చి యెద్దలను
హరియించి యుడుగక - యందు తాఁజొచ్చి ౧౧౫

తియ్యని పలుకుల - తీపులెత్తించి
పలువిధ ధనధాన్య - ఫలము లంభోంది
తేనె వట్టిన విరిఁ - దేఁటి చందమునఁ
దొలఁచెడి వెల వెలం - దుకలఁ గ్రమమున
నిలిపి యక్రమ పద్ధ - తుఁబ నడఁగించు ౧౨౦

కులధర్మ రక్షణ - కువలయేశ్వరుల
కారయ ముఖ్య కా - ర్యంబగుఁ గాదె?
యనుచు నుదయు నుల్ల - మల్ల చలింప
వాజులఁ బూన్చిన - పసిఁడి తేరెక్కి
మణిమేఖల వసించు - మండపమునకుఁ ౧౨౫

జని, దుర్గ యోఁకలి - చనఁగోలఁ బాత్ర
గొని నిల్చి తినిపించు - కొంతురున నొప్పి

యాఁకొన్న జీవుల - కన్నంబు నొసఁగు
పాత్రంబు చేఁగొన్న - పడఁతిని గాంచి
నెఱి మీఱు వలపుచే - నిలుకడ చెడిన
తనువుతో నాయుల్ల - మునఁ జొచ్చి దాని
నాక్రమించిన దొంగ - వధిక వ్రతములు
చేసి భుజించు నీ - జీవిక గాథ
తపమూని తిరిపంబ - తమి నారగింపఁ
గోరు కారణమేమి ? - కోమలీ! యనుచు
నొంటరివై తాన - యొగి డాసి యడుగు
టుత్తమ మని యెంచి - యుదయుండు చేరి
తాపసి వగులేల - తరుణి! తెల్పుమని
సాహసించి యడుగ - సారసనేత్ర
మును నన్ను వలచిన - భూపుత్రుఁ డితని
పదముల కెరఁగుట - పరమ ధర్మంబ
యని మ్రొక్కి హృదయంబు - నతనిపై కేగ
నితఁడు మున్నే యొక - నృప కుమారితను
చేపట్టినను పూర్వ - చిర పరిచితుని
కడ వాదులాడుట - గాదంచుఁ దలఁచి
ప్రశ్న కుత్తరమిత్తుఁ - బ్రాజ్ఞుల వలన
విన్న వీనులవైన - విన దగు నిదియుఁ

బుట్టుట పెరుఁగుట - ముప్పులనొంది
కార్శ్యమందుట చావు - గలయది మేను
పల్లిడుమల కాట - పట్టు మానవుల
తనువని పరికించి - ధర్మమాసించి
యిటులైతిఁ బెనుపోరు - లెసఁగ నడంచు
మత్తకరీంద్రంబు - మాడ్కి వారలకు
నాఁడు వారలు తెల్ప - నగ్గామా గొప్ప
యర్థంబు లేదిల - నైన నీ విషయ
మాలించి యవ్వలఁ - బోలిన తెఱఁగు
గావింపు మని యట - భూవర తనయు
వదలి యక్కన్ని చం - పావతి యున్న
* గుజ్జరి కోవెలఁ - గుదురుగఁ జొచ్చి
మగవారి చెయిది నె - ఱుఁగు వారలెవ్వ
రనుచుఁ జంపావతి - యడుగుల కెరఁగి
మంత్రమ్ము మదిని ము - మ్మాఱు జపించి
కాయచండిక రూపు - గైకొని వచ్చి
వెలుపలఁ గనఁబడఁ - దెలియక యుదయుఁ
డా గుడిలోనికి - నరిగి పాత్రమును

---

* ఘూర్జరులు శిల్పమునఁ బ్రసిద్ధులు. వారు నిర్మించిన కోవెల

కాయ చండిక కిచ్చి - మాయచే డాఁగు
నా మనోహారిని సు - న్నపు బొమ్మలందు
తెలియుచొట్టిది యని - తెలియంగఁ జూప
వేని యెన్నాళ్లైన - నిటుఁబడి యుందు
దేవి! ప్రవాళంపుఁ - దీరగు నోరు

కాటుక వెట్టని - కన్నులు తేట
చిఱు నగవును వింటిఁ - జెనయు కన్బొమలు
అంకుశమై దోఁటి - యై బరిగోల
యగుచు లోఁగొన విద్య - యనెడి మావంతు
చేఁగాఁపు వలవైచి - చిన్నారిపలుకు

లను వీణతోఁ జెల్పి - నమరించు వేద
వాక్కులఁ జూపించి - వరదంతి నొండు
వేఁటాడికొని పలుకు - వేల్పు! నీ గుడిని
చేరు దానిని వీడి - యూరక పోవఁ
జాల నొట్టిడితి నీ - చరణంబు లంటి

యీ కోర్కె దయచేయు - మో కలాదేవి!
యని యచ్చటన యుద - య కుమారుఁడుండె.

## ౧౯. చెఱసాల ధర్మశాల గావించుట

చంపావతీదేవి - చరణంబు లంటి
ముమ్మాఱు వలగొని - మ్రొక్కి రాకొమరుఁ
డొట్టిడి కూర్చుండ - నురు దయామతిని
రాఁగల దెఱుఁగక - రాజకుమార !
శపథంబు చేసితి - చనునె నీ కిద్ది ?

యని నేరుపున శిల్పి - యొనరించియున్న
యొక్క చిత్రంబున - నుండిన వేల్పు
పలుకంగ విని యెద - కలఁగ నాతండు
చెఱవడ్డ తెఱఁగునఁ - జింతించి కుంది
యామెను మఱవుమ - యని యదలించి

యాజ్ఞ గావించు ద - య్యము పల్కు మహిమ
యెందఱి యాఁకలి - నేని తొలంపఁ
గరమునఁ దాల్చు భి - క్షాపాత్ర మహిమ
ముగురు తల్లులఁ దోలి - దగు సరస్వతికిఁ
దప్పుజేసితి వని - దైవాఱఁ బ్రతిమ

పలికిన పలుకులఁ - గల మహిమమ్ము
మేర యెట్టిదో ? మణి - మేఖల చెయిది
యందు పదంపడి - యరయుద మనుచు

లేచునంతఁ దుఱంగ - లించు విశాల
ముఖము గలుగు భూమి - మొగిఁ దమి గ్రమింగ
సంజ యన్నొసలును - చంద్రవంక యను
కోర గలుగు నీల - వారణ మొఁడు
హస్తిపకుఁడు లేక - హస్తంబు చాఁచి
బంభరమ్ముల క్రమ్మ - వాసన గలుగు
మద మగ్గలింప భ్ర - మమునఁ గాల్ద్రివ్వ
క్రమము తప్పిన రీతి - గాఁ దొడరుటయు
నగర విటులు నెల - మగువల తోడ
మకర వీణియ యందు - మైత్రస్వరముల
మీటి స్వరైక్యంబు - మీఱ సారైన
తాళ క్రమంబనఁ - దగు వాఁడి భల్ల
ముల్లంబుఁ జీల్చంగ - నోర్వని యెడఁద
యందలి పొగతోడి - యగ్గిరాజంగఁ
గొలిమి తిత్తింబోలెఁ - జెలఁగ నిట్టూర్పు
చుదయ కుమారుఁడు - కదలిన పిదప
నున్న దేవళమున - నురువు వేఱుగను
గల మణిమేఖల - తలపోసి తుదకు
మాధవి తనయగా - మండప మందు
తిరుగు చుండిన రాకొ - మరుఁ డూరకుండఁ

డనుచుఁ బేరాఁకలి - నట నుండి నట్టి
కాయచండిక నూరఁ - గల జన మెఱుఁగు
నని యామె రూపము - గొని గొదగొన్న
వారలకుం దోడు - పడుట చేయిచ్చి
యిడుట తిరియు వారి - కడకేగి యిడుట
ఘనుల యుత్తమ మార్గ - మనిరి సద్వాదులు
కావున శారద - కోవెలలోన
నంచిన పాత్రమ్ముఁ - గొంచఁ జేతఁ
గొని వీథులం దేగి - గొద గొన్న వారి
కొసఁగుచు దండితు - లున్న కారాగృ
హముఁ బ్రవేశించి - యటనున్న వారిఁ
గాంచి నిట్టూరిచి - కరఁగి చింతిల్లి
యేడిచి యట బువ్వ - కేఁకరుచున్న
జనుల చేతులు నిండ - సాదంబు వెట్టి
కుడుపంగ వారికిఁ - గుడిపిన పాత్ర
మొక్కటే యని చాల - నక్కజ మంది
కావలి వారలు - భూవరు కడకుఁ
జని పాత్రదానము - చాన చెద్దియును
గొప్ప మహిమ తోడఁ - గూడిన దనుచు
మనవి చేయుద మని - మదిఁ దలపోసి

చని విష్ణుమూర్తి వా - మనుఁడయి చూడఁ
జూడఁ బెరిఁగి పెను - పోఁడిమి నొక్క-

యడుగునఁ బుడమిఁ దా - నడఁచిన నాఁడు
జలధార వీడిన - బలి వంశమందు
జనియించిన నరేంద్రు - తనయ కీర్తియను
దేవితో మొగ్గలు - తావితో నలరు
నలరుల తోఁటలో - నలఁబ్రవేశించి

యెల దేంట్లు వేణువు - నెలనాన నొత్తఁ
దుమ్మెదల్ వీణా ర - వమ్మొనరింప
జాతీయ గీతికా - సమితి కోకిలలు
పాడంగ నెమ్మలి - యాడుచు నుండు
విరుల పందిరిఁగాంచి - వేడుక నంది

హంసిని వీడిన - హంసమ్ముతోడ
నమ్మల జత ఱెక్క - లిమ్ముగా విప్పి
వలయమ్ముగాఁ జుట్టు - వానిని గాంచి
యలరి వెన్నుంటును - బలియును నీల
యాడిన జైత్ర మి - య్యదియగు నంచు

కని గోఁగు పూవు చే - రిన మావి పిందె
తో నున్న నెమిలిని - జానగు పైఁడి
గిన్నెలో పాలను - కీర పోతమున

కితవునఁ గుడుపు మే - ల్ప్రతిమ యానానుచుఁ
బ్రణయ కోపమ్మునఁ - బఱచు చున్నట్టి
వానరి నూరార్చి - వనచరం బొండు
చెలుల యుయ్యాలలోఁ - జేర్చి యాడించు
చుండుట గని యొయ్య - నొయ్యన నవ్వి
పచ్చని వెదురుతో - నచ్చంపుఁ బూవు
లమరిన తెల్ల క - డిమిఁ గాంచి శౌరి

బలరాముఁడును నిల్చి - వలఁ నయ్యె ననుచు
నంజలి ఘటియించి - యలరి నుతించి
యాటతో నభినయ - మరసిన వారు
కావ్యనాటకములఁ - గడు విమర్శించి
తెలియు వారలు వీణఁ - బలికించు వారు

పసగ మృదంగమ్ము - వాయించువారు
గమకముల్ క్రొవ్విని - గలిగించువారు
పాటలు సొంపుగాఁ - బాడెడి వారు
విని తల లాడించి - వివశులౌ వారు
తెగిన హారమ్ముల - మొగిఁ గ్రుచ్చువారు

చందనమ్ము మెయి న - లందెడు వారు
కుంకుమ స్తనముల - కుమ్మొత్తువారు
కలువ రేకుల హార - ములు గట్టువారు

కురులఁ దావి విరులు - చెరివెడి వారు
మఃరువుగ నద్ద మె - దుర నిల్చువారు ౧౦౩
నై యింద్రువలెఁ జని - యాటాడి యలసి
వన్నెల మల్లెలు - పొన్నలు జాజి
మాలతి పొగడ చే - మంతి మున్నైన
తరువుల కడ నిల్చి - తిరుగుచు నచ్చిఁ
మ్రుంగిన కుందేలు - మురిపంపు జింక ౧౦౪
రండని క్రోయని - రాణికిఁ జూపి
మరుఁడు వసంతుండు - మలయ మారుతము
యంత్రపు బావి క్రీ - డాద్రి ఝరంబు
విరుల పందిరియును - సరసు దీర్ఘికయుఁ
గూప మంతర్జల - కూపంబు దాఁగి ౧౦౫
వజ్రలు చోటులు సౌరు - స్ఫటిక గృహములు
గల యెల్ల యెడలను - కాంతుతోఁ దెరిగి
మగధదేశస్థులౌ - మణి కారకులు న
వంతి నాటను గల - స్వర్ణ కారకులఁ
యవన వర్ధకులను - ద్రవిడ కార్మికులఁ ౧౦౬
గూడి యొప్పిదముగఁ - గూర్చి వన్నియలఁ
గనుల పండువుసేయఁ - గల పగడంపుఁ
గోళ్లు మా నికములు - గూర్చు బోదియలు

ముత్యాల సరములు - మురువుగ వంగు
కోణసంధులు శిల్ప - గురుత యొప్పారు ౧౨౮

మేల్కట్టు గలుగు చా - మీకర మంట
పమ్మున నింద్ర భో - గమ్మున మీఱు
రాజు మోదమునఁ జే - రఁగ ద్వారపాల
కులతోడఁ దెలిపి రా - సెలవంది లోని
కేగి చాఁగిలఁబడి - యెఱఁగి భూపాల! ౧౨౯

యీభూమి నాసించి - యెద విరోధించి
చతురంగ సేనతోఁ - జనుదేరఁ గాంచి
వారి యుత్సాహ ము - వారించు వీర!
ఘనకీర్తితోఁ గల్ప - కల్పంబు మనుదు
గాక! యియ్యది విను - కరుణామయాత్మ ౧౩౦

ఏనుఁగు తిప్పుచే - నెడలి కృశించి
యూరఁ దిరుగు చేద్పు - చుండిన క్రొత్త
చేడె యొక్కతె మన - చెఱసాలఁ జొచ్చి
తమ పేరు వినుతించి - తన చేతి పాత్ర
మున నుండి యట మూఁగు - జనములు తనియ ౧౩౧

నన్నంబు పెట్టిన - దవనీశ తిలక!
యనవుడు పార్థివుఁ - డయ్యామ యిటకు
వచ్చుఁగాక యనఁ గా - వలివారితోడ

నా చెలి యేతెంచి - యవనీశ తిలక
కరుణ వర్ధిల్లును - గాకని నిలువ
నో తపస్విని! పేరు - నూరేది నీకు
నీపాత్ర మెక్కడి - దెఱిఁగింపు మనుడు
నయ్యమ యిట్లను - నయ్య! భూపాల!
ఏను విద్యాధర - మానిని నొక్క
కతన నజ్ఞాతనై - కాఱియ పడుచుఁ
దిరుగుచు నుందు నీ - పురమున నధిప!
ఈ చేతి పాత్ర మీ - యిచ్చటి మండ
పమ్మునఁ గలవేల్పు - నెమ్మి నొసంగె
నియ్యది దివ్య మ - హిమ గల పాత్ర
నేనుఁగు తీపును - హృదయానలంబు
చల్లార్చినది జీవ - సంతతి కీద్ది
యాస దీఱంగ ది - వ్యాన్న మొసంగు
[illegible]న రాజా నానుండి - యవసర మున్న
నడుగుమ యన నామె - యల్ల నిట్లనియె
చెఱసాల వడఁగొట్టి - కరుణామయు లగు
ధర్మాత్ములకు శాంతి - ధామమ్ము గాఁగఁ
జేయుము చాలు హ - ర్షింతు ననంగ
చెఱసాలఁ జెఱిచి యా - వరసాధ్వి తెలుపు
పగిది ధర్మాత్ములు - వరము గొనంగ
ధర్మముల్ బోధింపఁ - దగు ధర్మశాల
గాఁగ మార్పించె నా - త్మారమణుండు.

## ౨౦. ఉదయ సంహరణము

మేటి రాపని మణి - మేఖల కరుణ
నిరయ సమంబగు - చెఱి గదులందు
జన్మ దుఃఖము లొందు - జనములు కర్మ
ఫలముచే మంచి భ - వము గలవార
లైనట్లు నాల్గు స - త్యములఁ బ్రేమించు

గుణము గలుగు బుద్ధు - కోవెల నెనరు
ఒదగల ధార్మికు - లెనయు పల్లెయును
దానస సాలయు - బోన సాలయును
దృఢ రక్షణము కల - దిగ నగునట్లు
మణిమేఖల యటకుఁ - జనుటయుఁ దనకు

స్థిర కీర్తి నరపతి - చేసిన యదియు
నుదయుఁడు తలప్రీఁడ - నూహాలు సేసి
ప్రజ్ఞ గలారలు - పరిహాసించినను
రాజు కోపించినఁ - బ్రజలు నవ్వినను
వికృత వేషిణిని నే - వీడక పట్టి

హేమరథంబుపై - నెక్కించుకొనుచు
వెలఁది నేర్చిన విద్య - వీనులు నిండ
వినుచు నీతుల మాట - వినియెదఁగాక

యని లేచి పెక్కండ్ర - యాఁకలి దీఱ
మహఃతుక బొదిఁగిన - మండపమునకు

నల్ల నల్లనఁ జని - యామెఁ గాంచుటయు
మొగులు క్రమ్ము సిగర - ములు గల మలయ
గిరియందు వెదురులు - పెరుఁగు చిట్టేట
ముని యొసంగిన శాప - మునకైన గషువు
కడచనె రాదేమి - కారణ మనుచు

కాంచనుఁ డనువాఁడు - కాయ చండికను
వేఱొక త్రోవను - వెదకుచు వచ్చి
సంగమపురిఁ జేరి - చదుకఁబు పూల
తోఁటయుఁ దపసుల - వాటియు రచ్చ
కొట్టముల్ చపికలు - గుళ్లు రోయుచును
వచ్చి జనుల గొద - వనట దీర్చుటను
గని యట నిలిచి నీ - కరమున పాత్ర
మొక్కటే యయ్యును - పెక్కండ్రు కలరు
తినువార లేచఁగు - తీపెల్లు వోయె
నగ్గలంబై నొంచు - నాఁకలి తొలఁగ

వేలుపుల్ కరుణ చూ - పిర యేమి యనుచుఁ
బ్రామంతనములు జ్ఞా - పకముగఁ దెలుపఁ
దనుకని యెడఁద నా - తని కడనుండి

తొలఁగి యుదయుఁడున్న - తలమున కేఁగి
నెర గఱిగిన వృద్ధ - నారి నొక్కతను
కనిపించి తెన్మయుఁ - గట్టియునైన
యిసుక వన్నియ మాఱె - యిప్పుడు తెల్ల
యిసుక వంటి వయిన - యీ యమ కురులఁ
గాంచితే! చంద్ర రే - ఖను బోలు నొసలు
ముడుతలు పడియుండు - మురువు గాంచితివె?

నెరగల్గి తిరిగట్టి - నాసిల్లి యూచు
జడగంటివే? వింటి - సమమగు బొమలు
చూడవో? చేఁపల - చూపులుచూడఁ
గలవాళ్ల వంటివై - కానంగ నయ్యెఁ
గలువల వంటి క - న్నులు నీరు వట్టు
గుంట పోలిక దాల్చు - కుదురు వీక్షింతె?
బుడగను పోలిన - ముక్కును గనుము
చీమిడి వదలి యీ - క్షింప రోఁతయ్యె
నాణి ముత్తెపుఁ గాంతి - యగు చిఱునగవు
నిప్పుడు కంటివే - యెటవోయి డాఁగె

సారవిత్తులం బోలెఁ - జూపట్టు పండ్లు
ఎటువోయె? బోసి నో - రిట నిల్చెఁ గనుము
చివురుచు దొండను - చెనయు కెమ్మోవి

యే మయ్యెనోసుంత - యెఱిఁగితి వేమి?
రసిగల పుంటి క - రణి నీచు కాటి

వాడిన దంటు నా - వ్రాలిన చెవులఁ
గంటివె? కండలు - కరఁగి పెల్లెండు
ఖర్జూరముం బలెఁ - గనఁబడు మేను
పరికించితే? యుబ్బి - ప్రబ్బిన గబ్బి
గుబ్బలు నేమయ్యె - గొలగొల యగుచు

వట్టి తిత్తుల వలె - వ్యర్థమైన యవి
వ్రాలు బెంకాయాకు - వలె వ్రేలు కేలు
కానవో? నరములు - కానరాఁ దోలు
సడలి నఖమ్ముల - సంగతి వదలి.
సన్ననయిన వ్రేళ్ల - సవ్వరు కాంచితివె?

ఆనఁటి కంబము లట్టి - యంగైన తొడలు
మొగిలి యూఁచలు వాడు - వగయయ్యెఁగంటె?
అమ్మల పొదిఁ బోలి - నట్టి మీఁగాళ్ల
రంగు గాంచితివె? న - రమ్ము లెమ్ములును
బయలు వడ్డ తలిరు - పదముల స్థితిని

తెలియవో? యెండి ము - దిరిన బెంకాయ
రాలుట చూడుము - పూలచేఁ దావి
గందమ్ముచే నీచు - కంపు నడంచి

సూదిచే మణులచే - సొంపుగఁ బూర్వ
లేర్చి కూర్చిన మోస - మెఱుఁగవ యేమి?
యనుచు విద్యాధర - వనిత సోపమున
మణిమేఖల వచించు - మాటలు విన్న
విద్యాధరుఁ డిది - వీనినే గార
వించెడి నామాట - పెడచెవి నిడియెఁ
బరు వెంబడించెను - వాఁ డేగుచుండఁ
జూచుచున్నది రాజ - సుతునకు నీతు
లుగ్గడించి తుదకు నొక సైఁగతోడఁ
బగడంపుఁ దునకపై - నగవును కలువ
కనులతో సింగిత - మును చూపి పోయె
నితఁడు ప్రియుండౌట - నిచట నిల్చినది
యని కనలుచు నంత - నామె యున్నట్టి
మండపమునకు లో - మండుచు నరిగి
బుట్టకుఁ బాము ఱి - వ్వునఁ జొచ్చినట్లు
చొచ్చి యడఁగి డాఁగి - చూచుచు నుండె
లేమ తెల్పిన నీతి - లెక్కింప కుదయుఁ
డీతని వేడ్కతో - నింటికి నేగి
మణిమేఖలయె నన్ను - మభ్యపెట్టుటకు
కాయ చండిక రూపు - కడఁక ధరించి

పాత్రమ్ముచేసంది - వంచనచేత
మన్మథంబును విభ్ర - మ పఱచి చనియెఁ
బరుఁ డామెతో నేమొ - భాషించు చుండె
మున్నె యమ్మండప - మునయందు వాని
తోడ నద్దము రేయి - కూడక యున్నె?
యనయుఁడుఁ గాకని - యటనుండిలేచి
మలయమారుత రథం - బల విూనుపడఁగ
మొక్క చెఱకు విల్లు - మొగ్గ పూములికి
కలవాఁడె పలుకు ప - క్కముగాఁగ వేశ్య
తో నూరె నిద్రించు - నా నడు రేయి
నొంటరిదై యేన్గు - వెఁటాడ లేచు
వేఁగి పోల్కి నగరు - వీడి వాకిండ్లు
కడచి తావలచ్చిన - కలికి యున్నట్టి
మండపమున యందు - చండ పిషోగ్ర
భుజగంబు వసియించు - పుట్టలోఁ జొచ్చు
జోటిఁ జొచ్చుడు - వానిరాకను మున్న
తావి పూవులును చం - దనమును తెలుప
వాఁడె యిటకు దీని - వలచియే వచ్చె
నని యెంచి కట్ల దె - బ్బను దిన్నపాము
కపకోపమునఁ దన - పడగను విప్పె

నన లేచి రాకుమా - రుని వెంబడించి
వాని కొండను పోలు - బాహువుఁ ద్రెంచి
కాయచండికఁ గొని - గగన మార్గమునఁ
బోవుదమని డాయఁ - బొడవు కంబమున
దేవ కారువు దిద్ది - తీర్చిన ప్రతిమ
డాయకు కాంచనా! - డాయకు మనుచుఁ
గ్రచ్చఱఁ బల్కె - త - ర్వాత నిట్లనియె
మణిమేఖల యనెడి - మడఁతుక మాఱు
వేసమ్ము నూని యి - వ్వీధిఁ దిరుగాడెఁ
గాయ చండిక కుడు - గని గొద యేన్గు
తీపు తీఱఁగఁ బ్రసా - దించె నీయమయె
తన నొప్పి దీఱ నీ - దార వ్యోమమునఁ
జనుచో ఘటిల్లిన - సంగతి వినుము
అంబరచరులు దు - ర్గాలయ మున్న
వింధ్యకు మీఁదుగ - వెడలరు వెడల
వారల చాయతో - వారక లాగి
ద్రింగుచు వింధ్యను - మెలఁకువఁ గాచు
వింధ్యాఘటిక యను - వేల్పు కడ్పునకుఁ
గాయ చండిక యట్లు - పోయి చేరినది
చిన్న వోవకు మదిఁ - జింత నొందకుము

విధి యిట్లు నినుదెచ్చి - వీనిఁ జంపించెఁ
జెడు కార్య మెఱుఁగక - చేయుట కతన
విడువదు నిన్ను న - వ్విధి యని పలుకఁ
దన యవిమృశ్యత - తన్ను కంది ప
విద్యాధరుఁడు వేఱు - విధిలేక తుదకుఁ
బత్తివలె నెగిరి - పఱచె నెయ్యెడకొ.

---

## ౨౧. స్తంభ ప్రతిమ ఆగామి తెలుపుట

మయుఁడు చిత్రించు ని - ర్ణయ బుద్ధి గలుగు
ప్రతిమకుఁ బడమటి - వాకిలి కడను
బ్రాహ్మ్య మాలయము లో - పల నుండినట్టి
మణిమేఖలయు విభ్ర - మంబున లేచి
విద్యాధరుని చేత - పృథ్విఁ దావయు
దురవస్థయుఁ బ్రతిమ - యరయించు వింత
వృత్తంబు విని లేచి - యీ రూపు తనకుఁ
దీఱుఁ గాకని పీడి - దృష్టి విషంబు
నీ యసువులఁ దీసి - మాయించు తఱిని
చితి మీఁద పీడితి - జీవమల్ నేను
ఉపవని నీయెడఁ - గ్రుపమాలి మనసు
మాఱ్చ నయితిఁ గాన - మాయిలు వేల్పు.

మణిపల్లవమునకుఁ - గొనిపోయి వీడ
భవపాశముల నూడ్చు - భగవంతు పీఠ
మును చూచి నాతొలి - పుట్టువుఁ దెలియు

తర్వాత వచ్చి నీ - పూర్వ వృత్తంబు
చెప్పఁగాఁ దెలిసి నీ - సేమమ్ముఁగోరి
పుట్టిన వారలు - గిట్టు చుండుటయు
గిట్టిన వారలు - పుట్టు చుండుటయు
సుఖ దుఃఖముల తీరు - చొప్పడఁ దెలిపి

చెడువిధిఁ దలఁగింప - నెడఁ దలపోసి
కాయ చండిక రూపు - గైకొంటిఁ బ్రియుఁడ!
కనలు విద్యాధరు - కరవాలు చేఁ
గడకు నిర్జితని - యడలి తపించి
పరిదేవనము చేసి - పడఁతి లేచుటయు

మదిరాక్షి! పోవకు - మా దయుని కడకుఁ
జింతతో సివమెత్తి - చేరఁబోవకుము
ఇతఁడు నీ భర్తయై - యొనఁగఁ బుట్టుటయు
నితనికి నిల్లాల - వీవాట పూర్వ
పూర్వమ్ములం బలు - పుట్టువులందు

కలదొక్క పుట్టునఁ - గలయుది కాదు
తడఁబడు పొడుపులఁ - దొడరు దుఃఖములు

భవపాశ బంధముల్ - వదలించు కొనఁగ
యత్నింపుము కలంత - నందకు మనుచుఁ
బలుక బంగరు కాంతి - గలుగు పూఁదీఁగ
యన నొప్పి సత్యవా - క్యములతో నలరి
యిమ్మండపమ్మున - నెలరు దైవమ్మ!
నీ చరణములకు - నా చిన్ని నతులు
పూర్వజన్మంబున - భుజగంబు గఱవ
నితని జీవము లేగె - నిపుణ విద్యార్థ
రుని కత్తిచే నెద - ద్రుంగ నగ్గలపు
టుమ్మలికమ్ము నే - నొంద నిట్లాట
కేమి కారణమొ నీ - కెఱుఁగంగ రాదొ?
యెఱిఁగి తెల్పంగ నీ - కరుణ భాగ్యంబు
పూర్తిగ నేనిటఁ - బొందుదుఁగాదె?
యనఁగ నద్దేవత - వినుమని పలికె
కాయ గట్టను నేటి - గట్టున మాయ
తెలియని తబిసి రాఁ - గల యది తెలిపి
నిర్భ్రాంతులగు వారి - వీత కల్మషుల
నొనరించు బ్రహ్మ ధ - ర్మని చేరి సేవ
చేసి భిక్షుకు వంట - చేగను మనిన
వేకువ వేళఁ గా - వింపు మనుటయు

సంజయు రేయియుఁ - జన ముదమంది
వేకువ రా వంట - వేగ చేయుమని
బానసీనికిఁ దెల్పి - వాఁడాలసించి ౫౫

వచ్చి తొందర పడి - వంట పాత్రమ్ము
పడవేసి * శీలంబు - పాటించు మునికి
దోసఁ గాచరింపఁగాఁ - దోఁచిన కినుకఁ
దలయు భుజమ్ములు - ధరణిఁ బడంగ
నఱకిన క్రూర దు - ర్నయము ఫలమిద్ది ౬౦

---

* ఇది పంచశీలములు దశశీలములని యిరు తెఱఁగులు. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము అసంగ్రహము, అనునవి పంచశీలము లనబడు. వీనితో ఉన్నతాసన మిచ్చింపమి, చందనాదికము తాల్పమి, వెండి బంగారు తాకమి, ఆటపాట లిచ్చింపమి, రేయి భుజింపమి అనునవి చేర దశశీలము లనబడు. పంచశీలములలో కల్లుద్రావమి చేర్చి చెప్పువారును కలరు. (నీలకేశి గ్రంథము, సమయ దివాకరటీక) అహింస, అస్తేయము, అవ్యభిచారము, సత్యము, కల్లుద్రావమి అనునవి పంచశీలము లనియు నివి గృహస్థులకును విధులనియు వీనితో రేయి అశుద్ధాన్నము భుజింపమి, చందనాదిక ముపయోగింపమి, నేల చాపపై పరుండుట, అను మూడు చేర అష్టాంగ శీలమనియు నివి గృహస్థులలో నిష్ఠాపరులకే తగునవనియు, నీ యెనిమిదితో నాట్యగానము లిచ్చింపమి, వెండి బంగారు తాకమి, అను రెండును చేరి దశశీలములనియు, నీ పదియు సన్న్యాసుల కష్టములనియు వ్యభిచరింపమి యనుచో బ్రహ్మచర్యమనియు ధార్మికసూత్రమను గ్రంథమునఁ జెప్పబడినది. (చూ. పీఠిక.)

యప్పుడు నిప్పుడు - నతని పీడనిది
తాము చేసిన కర్మ - తత్ఫలంబులను
దైవమ్ము తప్పించి - తల్లఁ గాచు ననెడి
వా రవివేకులు - వనజాక్షి! నిజము
తగ వాచరించు నీ - డయితుఁడు ప్రేమ

కలఁడయ్యె ధర్మంబు - కలదయ్యె దుష్ట
కర్మ ఫలమ్ము త - క్కక కుడిపెడిని
అవి తరువాతి పు - ట్టువుల రావచ్చు
నచటి కర్మ ఫలమ్ము - నిచట నీ పగిది
కుడిపిన యది రాచ - కొమరుని స్థితికి

చింతించి మునులు వ - చించిన నిజము
విని రాజు నిను చెఱ - వేయును మరల
రాజమదేవి నీకా - రాణి వాసమున
నుంచు కొనఁగ నుద్దే - సించి వదల్చు
నీ తల్లి యఱవణ - నీఁదు నాత్మ పాద

నీరేజముల ప్రొక్కి - నిలిచి నీకైన
యాపద తెలుపంగ - నాతండు వచ్చి
తెలుపు వాక్కులు విని - దేవి నీ చెఱను
పీడుచు నవ్వల - విను మిది నీవు
రాజ శార్దూలుఁడై - రాజిల్లు నట్టి

గోపుత్రకుని కడ - కుం బోదు పోయి
ధర్మవాక్కులు విని - తన్నృపు తోడ
మణి పల్లవము చేరి - మణిపీఠి వలన
ద్వీపతిలకచేత - స్వీయ వృత్తంబు
విని శ్రావకేంద్రుండు - తన నాడు చేరఁ

బిమ్మట నాదీవి - విడి మానిరూపు
పూని వంజిపురికిఁ - బోయి యచ్చోట
గొప్ప భిక్షులఁ బలు - గుంద్రను గాంచి
పలువిధ ధర్మముల్ - పాటించి విందు
వట నహం బ్రహ్మాస్మి - యను వారు భువన

ముల సృష్టిచేసిన - మొదటి వాఁడనెడి
వారును తనకు రూ - పము లేదు ప్రాణి
కోట్లకు రూపమ్ము - గూర్చెడు వాఁడు
గద దేవుఁ డగునని - చదివెడి వారు
గాసిలి వ్రతములఁ - గడపఁ బుట్టువుల

సొరిది బంధము ద్రెంచి - సుఖలోకమందు
మేటి పదవి నుంచు - సూటి నన్వారు
భూత వికారమే - పుట్టు వన్వారు
పలు మతముల యసం - బద్ధ వాక్యముల
వినఁదగు నాళ్లలో - వేలుపు లేఁడు

గిట్టిన వారలు - పుట్టంగఁ బోరు
ధర్మమ్ముతో నేల - తగులాట మనెడి
భూతవాదిని జన్మ - మును ధర్మతత్త్వ
ములతోడ వినిన నీ - వెలనవ్వునగుదు
విది విని నవ్వితి - వేల నీవనుచు

నిజము తెల్పుమనంగ - నీ జన్మ వృత్త
మెఱిఁగింతు వది విని - యెలనవ్వ నవ్వి
యతఁడు స్వప్న భ్రమ - మందితి వనుచుఁ
బలుకు నయ్యాది మఱి - వం దగు దీవు
దుష్కర్మములు కీడు - తొడరించుటయును

మరణించు వారలు - మరలఁ బుట్టుటయు
సత్యమేయని నమ్మ - జనియించు భ్రాంతి
పీడుము ధర్మంబు - వీడని తరులు
ధరణియు వ్రాయు చి - త్రములు మాటాడ
వని యరయుట యరు - దగునేమి ? యరయు

దాక్ష్యా ? యరయవేని - యొప్పుగ వినుము
సంపూర్ణ మహిమతోఁ - జను నీ పురమున
దేవళములు నీడ - తావులు నీటి
రేవులు రచ్చల - తావులు పెద్ద
మండపములు మంచి - మహిమమ్ము గలిగి

రక్షణమున నొప్పఁ - బ్రాజ్ఞులు కాంచి
మంటితో రాలతో - మ్రాకుల తోడ
గోడలతో వేల్పు - గుళ్లు స్థాపింప
నేలఁపు లాచోట్ల - వీక్షక జనుల
కగునవి తెలుపు చుం - టరయవో నీవు

నావృత్త మడిగితి - నాతిరో! వినుము
దైత్యదిశుఁ దనువాఁడ - దైవగణముల
నొకరుఁడుఁ దొల్లి మ - యుండను శిల్పి
యనువుగ వాకుఁ జే - సిన బొమ్మయందు
నిలుతు నదేలన్నఁ - దెలిపెద వినుము

మర్త్యు లెఱింగిన ద - మర్త్యు లెఱుఁగరు
చిత్రసేనుండు నా - చెలిమి కాఁడగుట
యీ నగరము: వారి - కేవరు నొడిచిరో?
యాతనితోడ నే - నరిగి వయ్యాళి
చేసిన స్థలములఁ - జెలిమి పెంపారఁ

దరువు నీడయుఁ బూవు - తావికై వడిని
యుండిన వారి నా - యొప్పున వ్రాసి
నాలుక మోడంగ - నను పొగడంగ
మూఁడు కాలంబుల - ముచ్చటలెల్లఁ
దెలుపుచుండుదు నీకుఁ - దెలిపితి నింత

తెలియు మసఁగ నాపె - దేవతావళిని
తెలియుదు నాతఁడి - తెలుపు మనుటయు
ద్వైదికుం డిట్లను - తరుణిరో! వినుము
వానలు కురియక - ప్రాణులు చావఁ
గాంచీపురము స్థితి - కష్టఁ జెడుట విని ౧౪౫

జీవామృతముగఁ జం - పావతి యొసఁగు
దివ్యపాత్రము కేలఁ - దేజుఁగుగఁ దాల్చి
సుతమతి మాధవి - యుతుఁడై యరవణ
ముని యట నుండుట - విని కాంచి చేరి
యతని కృపామతి - మతభేద బుద్ధి ౧౫౦

వీడి నీవారలై - వెన్నంట జనులు
పాడి వర్ధిల భువి - వర్షంబు కురిసి
పంటలు పండఁగఁ - బ్రజలు మోదింప
యమృత సురభిఁ గొని - యన్నంబు నిడెవ
వాయూర ధర్మ మ - త్యభివృద్ధి నొందు ౧౫౫

నచ్చట నీవల్ల - నగునవి పెక్కు
కలవు తక్కిన ధర్మ - ములను బోధించు
వారి తత్త్వము లర - వణ మహామునికిఁ
జెలుపంగ నాతఁడా - దినములఁ దపము
ధర్మము తగవు ద్వా - దశ నిదానములు ౧౬౦

తెలిపిడి భవ మహా - జలధి తారణము
పద్ధతితోఁ దెల్పి - పాపంపు టిరులు
విరియ జీవతతి ని - ర్వృతి సుఖమంద
ధర్మ ప్రకాశమ్ము - తనరంగఁజేసి
బుద్ధితో ధారణి - బుద్ధ సూర్యుండు

పొడమువఱకుఁ జావు - పుట్టుక లొంది
ధర్మ పథము ప్రేమ - దవులక యాస్థ
లము వీడ మణిమేఖ - లా నీవు నేను
తల్లియు నెల్లరుఁ - దడఁబాటు లేక
న్యాయమార్గమ్మున - నడతుము గాక

యని యతండు పలుక - నాతని పలుకు
పాటించుచును జవ - దాఁటక - పెక్కు—
ధర్మమ్ము లొనరించి - తరువాతఁ గాంచి
పురమున దేహమ్ముఁ - దొఱఁగి యుత్తరపు
మగధలోఁ గలుగు జ - న్మములెల్ల గార

వంపుఁ బుట్టువులయి - పొడియుఁ గరుణ
తప్పక మహిమమ్ము - చొప్పడఁదోఁచి
కలఁకయు విభ్రాంతిఁ - దొలఁచి పరులకు
ధర్మ తత్త్వంబు బో - ధము సేయు వృద్ధ
ప్రియ శిష్యుఁడవయి పం - డ్రెండు నిదాన

ము లెటింగి త్రెంతు నీ - కులమునఁ దొల్లి
తగవుచే నున్నతిఁ - దనరు విజ్ఞాని
నొకని సంద్రమునుండి - యొగిఁ గాచినట్టి
మణిమేఖలాదేవి - మహిం సాధు చక్రు
నకుఁ బ్రేమతోడ న - న్నం బిడు ఫలము
వలన నీ జన్మంబు - గలిగిన దనుట
యరసితే? యుపవన - మందు గాన్పించి
మణి పల్లవమునఁ జే - ర్చినదా ఫలమ్ము
అని దైవ్యదికుఁడు తెల్పఁ - దన చింతవీడి
మేర మెఱుఁగు మణి - మేఖల యంత
నమ్మండపమున జెం - దమ్మునఁ గలఁక
నీఁగుటయును గాఢ - నిద్రలో నుండి
లోకమ్ము లేపెను - లోక బాంధవుఁడు.

## ౨౨. కారా బంధనము

తరణి మండలము పే - రిఱుఁ జెండాడ
నిష్ప్రతిపాతియై - నిలిచిన కంబ
పతిమ తోడను సర - స్వతిని పూజింపఁ
బోయిన వారలు - భూపతి సుతున
కొనరిన స్థితిఁ దెల్ప - విని చక్రవాళ

మందలి తాపసు - లందఱు వచ్చి
మణిమేఖలను గాంచి - మహిప కుమారు
మరణవృత్తమ్ము నీ - కెఱుకయె యనుచు
దలఁకక యామె త - ద్ఘటనమ్ముఁ దెలుప
మునివరుల్ మణిమేఖ - లను నృపతనయు

తనువును వేఱుగా - దాఁచి రాజేంద్రు
వాకిటి కావలి - వారికి రాకఁ
దెలిపి లోనికిఁ జన - నెలవంది యేగి
నిండు చంద్రు కరణి - నీవెల్ల యెల్లి
యున్నత స్థలి నిల్చి - వెన్నెల లీనఁ

గత్తియు దండమ్ముఁ - గరుణార్ద్రదృష్టిఁ
దనరి జగము గావ - ధర్మ చక్రమ్ము
దోసఁగు పొసఁగ నీక - దొరలును గాక
నేఁడె కాదీ పురి - నిన్నటి దాఁక
కామ మధువు ద్రావి - నేమంబు దప్పి

కుల సతులను డాసి - గురు తపస్వినుల
వెంట మనసు వీడి - వెతలను గుడిచి
యిలిగిన వారలు - పలువురు కలరు
క్షత్ర కులమ్ము నా - శ మొనరించు
పరశురాము నెదుర్చ - వలదని దుర్గ

మండలింపఁగఁ గాంత - మహీపాలకుండు
తన నగరముఁ గావఁ - దగు వారలెవ్వ
రనుచు యోచించి భూ - మిని పగవారు
తలకంగ భోగిని - తనయుఁ డుత్తముఁడు
వీరాధి వీరుఁడై - వెలయు కకందుఁ

డను వాఁడు తగిన వాఁ - డని నిశ్చయించి
క్షత్రియుఁడును కాఁడు - క్ష్మాపాలనార్హుఁ
డును కాఁడయని రాముఁ - డును జాయఁడనుచుఁ
ద్రోల్చి కష్టము లగ - స్త్యుఁడు తొలఁగింపఁ
గావేరిఁ బ్రవహింపఁ - గాఁజేయు దేశ

ముకు తా మరలి వచ్చు - దనుకఁ గావుమని
యనుచుటఁ గాకంద - మను పేరు దీని
కేర్పడె ; నాన్నృపుఁ - డితర వేషమునఁ
జన నెంచి యుండిన - స్థలమునఁ గరిగె
నవ్వేల నొక్క నాఁ - డప్పురి నొక్క

పాఱుత 'మరుది' కా - వేరి నీరాశి
యొంటరియై వచ్చు - చుండంగఁ గాంచి
చపలాత్మ యిది యని - చలిత చిత్తమునఁ
దలఁచి కకందుని - తనయుఁడు పొంద
రమ్మన నామె భ - యమ్మంది గంద్ర

గాంధర్వమున నాడఁ - గాఁ దగువారె
యని యూర నెల్లవా - రాడు కొనంగ
రంగులు లేని చి - త్రమ్ము కై వడిని
మేన నలంకృతుల్ - మాని గృహమ్ము
వదలి యాయమ మండ - పముఁ జేరి కంబ

గతిమను గాంచి వి - నుతి చేసి ప్రజలు
చేసిన నింద పోఁ - ద్రోసి కావుమని
ప్రార్థింప బ్రతిమయుఁ - బౌరులార! వినుఁ
డీ యమ వర్షమ్ము - నీయఁగఁ గలదు
శంక వల్దంచు వి - శాఖను గౌర

వించి పల్కెడు; వేల్పు - వినిపింప దేని
యూరి వారి మదిని - దూఱు తొలంగ
దని యామె మఱఁది - నాఁట నీసోనఁ
గాను రెండవ బాము - గనుమీఁద నగుదు
నని తన మది నిశ్చ - యము వెల్లడించి

తన నేఁడ కేగిన - తరువాత ధర్మ
దత్తుండు తాఁ దలి - దండ్రులం గూడ
తప్పురి వీడి నిం - దాకరమైన
యగడు తొలంచితి - వని స్తంభ చిత్ర
మును చాలఁ బొగడి క - ల్మల చేతఁ గలల

చే మహాకవి నుతిఁ - జెందు దక్షిణపు
మధుర చేరిన మీఁద - మామ కుమారిఁ
దక్కఁ దక్కిన వని - తల నొల్ల నిక్క
మీపుట్టు కడచుఁగా - కిట్టులె యనుచు
సద్వ్రతంబుల నూని - [1] సద్వణిగ్వృత్తి ౧౧౦
గడియించి నట్టి యు - త్కట ధనరాశి
కధిపతివై [2] యెట్టి - యను బిరుదంది
యుఱువది వత్సరా - లరిగిన పిదప
ధర్మదత్తుని గాంచి - తపసి యొక్కరుఁడు
[3] సన్నిధి ద్వయి కధీ - శ్వర ! యొక్క ౧౧౫
పలుకు వినుము భార్యఁ - బడయని వారు
పలు విధ ధర్మముల్ - పరఁగఁ జేసినను
నేలుపు లోకమ్ము - వే చొరఁ జాల
రనుట వినవా ? నీవు - విని మఱచితివా ?
విని మఱవవ యేని - వేగ నీ పురికిఁ ౧౨౦
బొమ్మన మధురాపు - రమ్ము వ్యర్థమ్ము
గాఁ జన నీపురి - కోజఁ జేరుటను

1. కొనుట ఎక్కువయు ఇచ్చుట తక్కువయుఁ గాని వృత్తి.

2 రాజువలనఁ గొనఁబడు పట్టమునకుఁ దగిన ముసిఁడి పూవుగొనుట (ఎట్టి = ముసిఁడి)

3. ఇహపరములు రెంటికిఁ గూడఁబెట్టఁబడినది.

విని విశాఖయు నింటి - వెనుక మార్గమున
లోనికిఁ జని క్రీడకి - లోఁకువ గాక
పలువురు బిడియంబు - వడ నుత్తముఁడగు

ధర్మదత్తుని గాంచి - దాపున నిలిచి
మన మిష్ట పూర్వపు - మాడ్కి నరయము
మనకు నప్పుడు విభ్ర - మము గూర్చి నట్టి
సౌందర్య మిప్పు డె - చ్చట డాఁగినదియొ?
నీ కలువది యేండ్లు - నిండిన విపుడు

నాకును వెండ్రుకల్ - నరసె యౌవనము
కామమ్ము హరాయెఁ నె - క్కడ ముడిఁగినదో?
నీకు నీ భవమున - నే సతిఁ గాను
మఱి పుట్టువునఁ దప్పు - మార్గంబు లేదు
పరువ మస్థిరము మే - నరయ నిల్వనిది

ధన మనిత్యము దివిఁ - దనయు లీలేరు
తాఁ జేయు ధర్మమే - తనకుఁ దోడగుఁ
దాళవు గమ్మన - ధర్మదత్తుండు
మామ కూఁతునకు సం - పల్లక్ష్మిఁ జూపి
వడి నామెతోఁ గూడి - నడపిన తగవు

పెంపారి రిక్కల - గుంపుల కంటె
గడుకొనఁ గన్నెయై - ముదిసిన యాపె

ప్రతిమ వాక్యమునఁ బు - రమ్మున వారు
చేసిన చెడు నింద - చెడఁ బెద్ద వీథి
నరు దెంచు చుండంగ - నంతలో నొకఁడు

మరుదిని కామించి - మడిసిన వాని
యన్న యామెం గాంచి - యధిక కామమున
మత్తుఁడై తన తాల్చు - మాలికఁ దీసి
చేకొని పూర్వులు - చెప్పిన పెండ్లి
వహి యిది యని మెడ - వైవంగఁ బూని

యెత్తిన చే యది - యెత్తిన యట్లె
తలముడి నుండి - యివ్వలికి రాదయ్యె
విని యది యాతని - జనకుండు కినిసి
కొడుకని చూడక - తడయక నఱకెఁ
గల్ప కల్పము భూమిఁ - గాచి వర్ధిల్లు

భూపతిలక ! యని - మునుల నొక్కరుఁడు
వచియింప విని రాజ - వర్యుండు నేఁడె
కాదు పల్మాఱులు - ఘన విషయముల
నెంచి దృష్టాంతీక - రించి పల్కితిరి
అట్టి దుష్కృతి నేఁడు - నరయంగఁ గలదె ?

యన్నఁ దెల్పుఁడి యని - యుర్వీశుఁ డనుడుఁ
జెమగులు చెమఁగాక - యొసయల మిన్న !

యని యొక ముని యిట్టు - లనియె సిద్ధాంత
వాక్యమ్ము లెఱిఁగిన - వార లీ భువన
మున వీడినవి యైదు - మొనయు నిక్కముగ ౧౬౫

కల్లును బొంకు దొం - గతికము హింస
కామ మనెడి వీనిఁ - గడముట్ట నడఁచు
వార లన్నిటి గెల్చు - వారలు గెలువ
లేని వారలు తక్కు - వాని నన్నిటిని
గెలిచియు నిజముగ - గెలువని వారె ౧౭౦

కాము గెల్చిన వారె - ఘన తపోధనులు
తక్కినవారు స - ద్గతి లేని వారు
ఘోర నరకమునఁ - గూలెడి వారు
రాజేంద్ర ! వినుము చి - త్రావతి తనయ
తన ప్రియుఁ బొందిన - దాయ మూలించి ౧౭౫

బన్న మోర్వక *ముని - పల్లెఁ జొచ్చినది
మెలఁత కూఁతురు మణి - మేఖల యనెడి
పడుచు తపము సేయఁ - బొల్పడి యూర
నిల్లిల్లు చని బిచ్చ - మెత్తుచు నుండి
మండపమునఁ జేరి - మలయు చుండినది ౧౮౦

అది యట్టిదియ యైన - నామెను నీడ
పగిది వెంబడి దాని - పై వలపుఁ గొని

* మునిపల్లె = బౌద్ధవిహారము.

చిమ్మ చీఁకటి యని - నెమ్మదిఁ గొనక
మండపమునఁ జేర - మఱఁతుక కాయ
చండిక రూపున - నుండిన దచటఁ

గాయ చండికయు న - క్కడ నుండెఁ గాన
దత్పతి భర్త వి - ద్యాధరుఁ డటకు
వచ్చి దాని వెదకు - వాఁ డామె రూపు
గొను మణి మేఖల - వెనువెంటఁ దవిలి
దుర్విధి రేఁపఁ ద్వ - త్సుతుఁ డుదయుండు
చేరిన యా చిమ్మ - చీఁకటి వేళఁ
దన సతిపై వల - పున వచ్చె ననుచుఁ
దలఁచి తటాలునఁ - దన చేతి వాలు
తో దార కొమరుని - దోర్దండ భుజము
నఱకె దుర్విధి యని - వర మునుల్ దెలుప
భూపతి వారల - మోము వీక్షించి
తాఁ జేయఁ దగియుండు - తగవు నాఁడు
చేసెను గాన దో - షియె కాఁడు నిజము
తపసుల వ్రతము క్రొ - త్తడుఁ శీలమ్ము
మానవపతి కావఁ - డేని ధర్మంబు

కొఱకు రథముక్రిందఁ - గొడుకుఁ ద్రోయించు
దొరకులంబున నొక్క - దుష్టుండు వొడమె

అను వార్త రాజులు - విను మున్నె వానిఁ
గాటఁ జేరిచి కాల్చి - గణిక పుత్రికను
తెప్పించి చెఱను బం - ధింపుఁడీ యనియె.

## ౨౩ కారా విముక్తి

ప్రభువరు దయ నొంది - వాసంతి యనెడి
ముదుసలి నరసిన - వెద గల వనిత
జనపతి కేని త - త్తనయున కేని
దేవేరి కేనియు - దృష్టాంత సహిత
ముగ వివరించి నె - వ్వగలను దుడుచు

సార్థ మనోజ్ఞ వా - క్చతురత గలది
రాజమ దేవికి - రాఁజిన చింత
తొలఁగఁ ద్రోవఁగఁ ద్వర - తోఁ జని చూచి
పట్టఁ జాలని దుఃఖ - భరముతో నేడ్చు
పదములఁ బడి మ్రొక్కి - యెదుట నిల్చున్న

రాణిని దీవించి - రాజాధికార
ముం గొని ప్రజలను - బ్రోచి దీర్ఘంపుఁ
గ్రోధంబు గలుగు మా - ర్తుర వళి పఱచి

కొనినను *దర్భపై - న నిచి ఖడ్గమునఁ
జీల్చి పోర నరులఁ - జెండాడి చచ్చు.
రాజులు చేరు స్వ - ర్గము చేరుఁ డనుచు
భూసురుల్ వచియింప - ముదిమిని పొంది
చచ్చుట యీ వంశ - సంభవు లైన
ప్రభులకు నా నాల్క - పలుక మై కొనదు
అయ్యది సిగ్గిల - ఁగు పద్ధతి యగుఁ
దన దేశముం గాచు - కొనుటకుఁ గాదు
పరుల దేశము వశ - పఱచుకోఁ గాదు
మఱి యేమనఁగ వచ్చు - తొమ్మపుత్రు చావు
మన్నిని యెదుర ను - మ్మలికంబు గొనకు
మని యామె నూరార్చి - యరిగిన పిదపఁ
జేష్టలచే మన - శ్చింతను డాఁచి
నృపవరు దేవి కృ - త్రిమ నీతి పూని
పుత్రశోకము నెద - పొదలోన డాఁచి
మణిమేఖలను కృత్రి - మమున వంచించి
కసి దీర్చుకొందుఁ గా - క యని లోనెంచి

* పోరిలోఁ జావక ముదిమిచే రోగముచేఁ జచ్చిన రాజుల శవమును విప్రులు దర్భయందు వైచి, తమ మగఁటిమియే యాంతగా యుద్ధమునఁ జచ్చిన రాజులు చేరు లోకము వీరును చేరుదురుగాక యని కత్తితోఁ జీల్చి పదపడి యంత్యక్రియలు గావించుట పూర్వ క్షత్రియాచారము.

యొకనాఁడు తన విభుఁ - నొద్దఁ గూర్చుండి
సల్లాపములు సేయు - సమయంబునందు
పరులు వెన్నాడఁగ భా - వంబున రోయు
బిచ్చుకత్తియ యైన - వేసంబు గాంచి
మతి నళియించిన - మన యుదయుండు

ధరణీశ సుతుఁ డనఁ - దగఁడు నిజమ్ము
చెఱకు విల్తుఁడె తన - చేష్టలు దక్కఁ
దలఁచి పొందఁగరాని - తన యౌవనమును
సఫలంబు గానీక - సమయింపఁ జేయు
వేధ గల్గిన మణి - మేఖల యిచటఁ

చెఱ నుండఁ దగిన దు - శ్శీలాత్మ కాదు
అనుడు రాజేంద్రుఁ డ - య్యమ కిట్టు లనియె
జననుత జ్ఞాన మొం - దిన వారె సుతులు
మందులౌచో మఱ - వం దగు వార
లని యెఱింగితి మేల - యయ్యో నా పడఁతి

చెఱ విడిపింపుము - చెలువ! నీ వనుడు
విడిపింతు నాతోడ - వెలఁదుక యుండఁ
గాంతు నొందిన నుండుఁ - గాక కాదనుచుఁ
దన పాత్ర చేఁ గొనఁ - గొనుఁగాక యనుచు
రాణి యామెను తోడ - రమ్మని కొనుచు

నంతి పురికి నేగి - యట దీని తెలిపి
మందులచే నాశ - మందించి జనము
తతిమి కొట్టం బగు - దానిఁ గావింతు
నని యెంచి పిచ్చి మం - దును దినిపింపఁ
బుట్టుల యెఱుఁకువ - పొందిన వారి ౫౯

నది యేమి యేని చే - యఁగ లేదు కాన
నెప్పటి యట్లుండ - నెడ్డయై రాణి
చదువు సాములు లేని - చండి నొక్కరుని
వెదకి తెప్పించి యొ - ప్పించి యమ్మగువ
మణి మేఖల తనకు - మక్కువ వలపు ౬౦

క్షత్రియ యని దాని - కాయంబు నందు
కలయిక చిన్నెలఁ - గాన్పించి తనకు
వశ మైన దని పుర - వాసుల కొప్పఁ
గల్పించి చెప్పుమ - కాసు లిత్తు నని
చేతి నిండుగఁ బోయఁ - జేకొని వాఁడు ౬౧

సుదతి కూర్చుండిన - చోటికి నేగి
మోఱకుఁదనము చూ - పుచు నిల్చునంత
దేవి వంచన మని - తెలిసి యా చెలువ
మంత్రము జపియించి - మౌనమ్ముతోడ
మగ వేసమున నిల్చె - మడియుండు కాంచి ౬౨

జంతుచు రాణి వా - సంబునఁ బురుషు
లుండ రీవింత యే - మో నిరయమునఁ
బడు నీమె దుష్ట భా - వము నేరకుంటి
నని వాఁడు పరువిడు - నంత సూనునకు
చెడుగు గల్గించిన - చెడిపను బ్రతుక

నిచ్చుకేలని నిచ్చ - యించి భరింప
రాని నోవున నోగి - రము పీడె నంచు
వ్యాజంబు గల్పించి - వాయువు లేని
గదిలో నడంప నాఁ - కలి లేని మంత్ర
మున్నది కావున - నోగి జపియించి

కార్శ్యంబు నొందమిఁ - గాంచి యా రాణి
చేష్ట లుడిగి నేను - చెమ్మగిల్లంగ
నమ్మ ! తపస్విని - వగు నీకుఁ జెడుగు
పుత్ర దుఃఖమ్ముచేఁ - బొందఁ జేసితిని
మన్నింపు మని మ్రొక్కె - మణిమేఖలయును

రాహులు నునుఱు స - ర్పము హరియింప
బ్రదుకఁ జాలక శరీ - రముఁ గాల్చు నాఁడు
వానికై యట నుండి - వగచితి విప్ర
డోర్వక యేమేమొ - యొనరించి తిచట
నునుఱుల కేడ్చితో? - యొడలి కేడ్చితివో?

ఒడలి కేడ్చితివేని - కొడుకును గొనుచుఁ
గాటఁ బెట్టిన కష్టఁ - గఱిను లెవ్వారు?
ఉసురుల కేడ్చెదే - నొగిఁ గర్మఫలముఁ
దొడరి తా వేఱొక - యొడలిలోఁ జొచ్చు
నిది యెఱుఁగు తెలివి - యిలలోన నరిది

తనయు జీవములకే - నెనరు చూపితివి
అన్ని జీవుల యెడ - ననుకంప గొనుము
దేవి! నీతనయుఁ డా - తీరున నగుట
కున్నది కత మది - యొప్పుగ వినుము
వంట పాత్రము నేలఁ - బడి పగులంగఁ

గినిసి పాచకు నఱ - కిన పాప ఫలము
పాఁప నెపమ్మునఁ - బ్రాణముల్ దీసి
విద్యాధరుని కత్తి - వ్రేటునఁ ద్రుంచె
నని పుష్పవనము చొ - చ్చిన యది మొదలు
దైవము తెలుపు న - ర్థము తుది గాఁగ

వివరించి యంతట - వెలఁది యిట్లనియె
పిచ్చిమందులు - నాకుఁ బెట్టితి - గోల!
మఱి జన్మవృత్తమే - నెఱిఁగితిఁ గాన
మఱపు గూర్పఁగ లేదు - మానిని! మూర్ఖుఁ
డొకఁడు నీ పంపున - నొయ్యన రాఁగ

మగ రూపు గొని యుంటి బెగడంగ వాఁడు
ఆఁకలి చెడు మంత్ర - మరసితిఁ గాన
నీవు చేసిన కుట్ర - నెఱవేఱ లేదు
కామ గమనమును - కామ రూపమ్ము
నెదఁ దలఁపఁగ నైతి - నేలందువేని

పూర్వ జన్మంబునఁ - బాలుచు నా పతికిఁ
దల్లివై యుండుక - తన నీకుఁ జెడుగు
గలిగించు దుష్కర్మ - ములఁ దొలఁగించు
తలఁపుతో నీ దోస - ముల లెక్క గొనక
నిలిచితిఁ దెలుపంగ - వలసిన వాని

వినిపించుచుంటివి - వినుము శ్రద్ధమెయి
ధరణిపుల్ న్యాయంబు - తప్పి చరింపఁ
బ్రజలును తార్మ్యాబు - పడిన దేశమున
నిల్లాలి నొక్కతె - నిలుతేఁడు వీడఁ
దనయుని వీడి యా - తన్వి యొంటిమెయి

నిచ్చ వచ్చిన యెడ - కేగి యిచ్చించు
తీరునఁ గులటయై - తిరుగుచు నుండ
నా మమ కొడుకు బ్రా - హ్మణుఁ డొక్కరుండు
పెంచి పెద్దగఁ జేయఁ - బెరిఁగి యాకులట
నెఱుఁగక కామించి - యొఱిఁగిన పిదప

మరణించుటయు, దప్పి-మానుచు వేడ్క
నెండ మావులఁ గని-యెలసిన హరిణిఁ
గరువు జాతిఁగ వడిఁ-బరువిడు దాని
వేఁటకాఁ డమ్మున-వ్రేయ నా జింక
పడుటను గని మతి-చెడి తపియించి

కో యని కోపెట్టు-గో డాలకించి
నిట్టూర్పుతోఁ గఁట-నీరమ్ము కార్చి
కరఁగి యవ్వేఁటరి-మరణించుటయును
మదపుటేన్గు నెదుట-మత్తున నేగి
దంతమ్ము లాగ త-ద్దంతిచేఁ జావఁ

బడి యిలుగుట త్రావు-ఫలమాట చూచి
మఱచితివో? కల్ల-కఱుదు లాడుటలు
ముఖ్యవృత్తిగఁ గొన్న-మొఱకు లొనర్చు
క్రూరకర్మ ఫలమ్ము-కుడువమి గలదె?
దొంగలు పొందెడి-దుఃఖమ్ము లివ్వి

యని వివరింపంగ-నవసర మున్నె?
ఇవి యైదు జగమున-నిడుమలఁ గూర్చు
నవి యని వదలంగ-నర్హులు జనులు
చదువుటయే కాదు-సద్భాషణమ్ము
కనలు వీడిన వారె-కఱచిన వారు

జగతిని జీవించు - జను లెవ్వరనిన
నున్నది పేదల - కొసఁగెడి వారు
జగము నెఱింగిన - చతురు లేరనఁగ
నొచ్చు వారల గొద - నొగు లూడ్చువారు
బాములఁ దొలఁగించు - పరమార్థ తత్త్వ

మెఱిఁగిన జ్ఞాను - లెల్ల జీవులెడఁ
సమదృష్టి నెనరు ని - చ్చలు చూపువారు
అనుచు విజ్ఞానతో - యమ్ము ప్రోక్షించి
రాజమదేవి క - ర్ణంబులఁ బోసి
తనయు దుఃఖాగ్నికి - మన మింధనముగ

మే నెరియించెడి - లోని యంగదను
రత్నమేఖల యార్ద్ర - రంజిల్లి చిల్ల
పడిన నీరము వలె - భావంబు తేఱి
చలమును వీడి ని - శ్చల భక్తి మీఱఁ
జాఁగిలి పడ నామె - నమ్మతి గొనక

యిది యుక్తపద్ధతి - యెట్లగుఁ జెపుమ ?
పతికిఁ దల్లివి రాజ - పత్నివి యనుచు
మణిమేఖ యె ప్రొక్కి - మహీపతి సతికి

## ౨౪. గోపుత్రకు దేశము చేరుట

మానవేశ్వరసుతు - మనసును మార్చి
ముదివేశ్య తనసేయు - మోసంబు వలనఁ
గాంచను కత్తిచే - ఖండింపఁ బడియె
నుదయుఁ డనెడి వార్త - బెదరు తోడ విని
రాణి పాదములఁ జి - త్రావతి తెలచి

సాధు తాపసులు ప్ర - సాదించి నట్టి
పదునొకండుగురును - వాసవుని సభ
నభినయ దోషంబు - నంది శాపమున
వసుధపైఁ బుట్టిన - వారై దుగురును
ముని కోపమున జయం - తుని తోడ భూమి

నూటి జనించిన - నూట నల్వంద్రము
పాకారి యెదుట నూ - ర్వశి శాపమంది
నా కులంబునఁ బుట్టు - నాతి యొక్కతెయు
వెరసి నూటిరువ దొ - క్కరు నొక్కచోట
నొక రూపమునఁ బుట్టు - వొందిన కరణి

నొప్పారు మాధవి - యిప్పార నందు
పుట్టు నాఁటుగోలెఁ - బొందు నాదుఃఖ
మెవ్వరు నొంద రి - లేశ్వరు దేవి!
గణిక లందెల్లర - కంటె నెక్కుడుగ
నోయి యొసంగిన - ప్రోడ కోవలుఁడు

మరణించె నని విని - మాధవి మునుల
పల్లెఁ జొచ్చుట దాని - పట్టి పాత్రంబు
చేపట్టి యిల్లిల్లు - చేరి బిచ్చంబు
గొనుట నవ్వంగఁ ద - గుఁగాక యాట
వనితల కీది యుక్త - మన రెట్టివారు

కాన నిమ్మడఁతుక - చే నుదయునకుఁ
గలిగె నంతియు యని - తలఁపంగఁ జనదు
రమణులచే నగ - రము పొందు నిడుమ
లెన్నఁ దరమ్ముగా - దిది యొంతు వినుము
ఉప్పళంబున గొప్ప - తిప్ప యిసుకను

పొంగుచు నున్న త - రంగముల్ తాఁకు
పొన్నతోఁటను రాజ - పుంగవు నెదుట
మాధవమునఁ దావి - మలసిన చోట
నొకప్రక్క నొ. టిమై - నొక్కర్త కానఁ
బడ నీమె యెచ్చటి - కాంత యొందుండి

యిట వచ్చెనని సుంతి - యెఱుఁగక మరులు
గొని కను కంటిలో - విను చెవి యందు
తిను నోట వాసన - గొను ముక్కునందు
తాఁకు నెఱుక గల - తనువున యందు
విజయ ధన్వియగు పూ - విలుతుని మల్లె

కంకేళి మామిడి-కలువ పద్మమ్ము
పరువ మందు విరియు-విరియంప తావి
వీవంగఁ బెక్కు ద్రే-వేఁపులఁ గనిన
రాజా పడఁతి పద-రాజీవములకు
నెఱఁగి త్వత్పద సేవ-కరుణింపు మనఁగ

సరి యని యొక వెలఁ-ధరణీశుతోడఁ
చెలువ యుండియు మీఱదఁ-దెలుపక పోవ
పిదప నెచ్చట డాఁగె-వెలఁదుక యనుచు
విభుఁ డెల్లయెడలను-వెదకుచుండఁగ
నీటఁజొచ్చిన యట్లు-నేలను మునిఁగి

చంద్ర సూర్యులఁబట్టు-జరగిన కరణి
నింగికి నెగయుచు-నీటను వడచు
చారణుం డగపడ-జనపతి మ్రొక్కి-
దేవ సమాన! నా-జీవ సమాన
యిట డాఁగె నటకేఁగె-నెఱుఁగ నంతయును

ఎఱిఁగి యుండినఁ దెల్పుఁ-డీ యని కేలు
మొగుపఁగాఁ జారణ-ముఖ్యుఁ డిట్లనియె
నీ లతాతన్వి-నేఁ గాంచ లేద
యైన నాచెలిఁ బూర్వ-మరయుదు వినుము
నాగదేశము నేలు-నరపతి దేవి

స్వామి! యోఁధులు పెక్కు - చన్న యాపిదప
నాపుణ్య ఫల తతి - మీపాదములను
నొప్పించి యిచటికిఁ - దెప్పించె నాల్క
సన్నగిలక యున్న - సడలిన మేను
పెక్కేండ్లు నిలిచి యీ - పృథివి జీవులను
పావన మొనరించుఁ - గావుత మనుడు
నమ్మునీంద్రుం డిట్టు - లను రాణితోడ
నురు తపఃకాయమ్ము - నొందితి నైనఁ
గ్రుంకుచునున్న సూ - ర్యుని పోలియుంటిఁ
బుట్టిన వారలు - ముదిసిన వారు
తెగులొందు వారలు - తెగిన వారగుట
స్వాభావికమ్మ యై - శ్వర్యమ్ము కాదు
* ఎన్న నవిద్య సం - స్కృతియు విజ్ఞాన
మును నామరూపముల్ - గనఁగ షడాయ
తనము స్పర్శమును వే - దనమును తృష్ణ
మమత భవమ్ము జ - న్మము కర్మఫలము
ననెడి పండ్రెండుఁ బా - వనలు విజ్ఞాన
మున నెఱుంగుదు రట్లు - కనుఁగొనలేని
లోఁతు గౌరవము వి - లోకించు వారు
ఇఁకనవిద్య యనఁగ - నేర్పడ వినుము

* వీని వివరణము మున్పదవ ప్రకరణమునఁ గలదు.

చదివి చదువువాని - మదిఁగానలేక
మెఱఁగిన యదియును - మఱచి కుందేటి
కొమ్మన్న దనఁగ ని - క్కమ్మనుకొనుట
జగములు మాటట నీ - జగమె గొప్పదగు
జీవు లాఱు తెగలఁ - జెలఁగు నీ జగతి

ప్రజలు వేలుపులును - బ్రహ్మలు నార
కులు మృగములు భూత - ములు నననొప్పు
వీని గర్భముల ద్వి - విధ కర్మవలనఁ
బుట్టుచు సుఖ దుఃఖ - ములఁ బొందుచుండుఁ
జెడుగులఁ గలిగించు - చొడలునఁ దోఁచు

కొల దొంగతనము - వలపను మూఁడు
కాయ దోషములన - గణనకు సొక్కఁ
గల్ల కొండెమ్ములు - కటువాక్క వ్యర్థ
వాక్కను నాల్గును - వాగ్దోషములగు
కోరుట కినియుట - కూడని చూపు

నను చిత్త దోషంబు - లగు మూఁడుచేరి
పది విధములఁ గల్గు - ఫలము తెఱంగు
నన్మతు లీ త్రోవఁ - జనకుండువారు
పోయిన మృగములు - భూతముల్ నార
కులుగ మనశ్చింత - గలిగి పుట్టుదురు

పైని కందిటిని - వదలి శీలమ్ము
దాలిచి దానమ్ము - తల ధరియించి
ప్రజగ వేలుపులుగ - బ్రహ్మలు గాఁగఁ
బ్రభవించి సత్కర్మ - ఫలముల మోద
మునఁ గుడుతురు పుణ్య - మొనరించు వారు

మీర లీధర్మముల్ - మేకొని వినుఁడు
మణిమేఖలా! నీవు - మఱుజన్మ మెఱిఁగి
యున్నఁ దక్కినవియు - విన్న యామీఁద
వచ్చిన నీకు నీ - పద్ధతుల్ వీని
యంతర్విభాగము - లాదట వినుతు

నని మునీంద్రుఁడు లేవ - మణిమేఖలయును
లేచి యాతని పజ్జ - లేజ యుగమున
కెరఁగి యెల్లరు మీర - లిమ్మహామహుని
పలుకుల మఱవక - పాటించి నడవుఁ
డేనిట వసియింప - నిఁక నిచ్చగింపఁ

గాంచినవారు భూ - కాంతుని పుత్రు
పాలి మృత్యువనుచుఁ - బలుకుచుండుదురు
గోపుత్రకుని పురిఁ - గోరికఁజేరి
యవ్వలఁ బరిపూత - మగు మణిపల్ల
వమ్మును సేవించి - వంజికిఁ బోయి

పత్ని దేవతకు సే-వలుచేసి మెల్ల
కడలఁ జరించి స-త్కర్మ లొనర్తు
నాపద నాకగు-నను చింత యుడుగుఁ
డని వారలకు మ్రొక్కి-యత్తఱి క్రాఁగి
కరఁగిన బంగారు-కరణి సూర్యుండు

కనఁబడి యస్తమిం-చిన సంజవేళ
మండపమ్మునకుఁ జం-పావతి గుడికిఁ
జని సేవ లొనరించి-స్తంభ ప్రతిమకు
దండంబువెట్టి యం-తర్వీథి నెగిరి
చని పుణ్యరాజు ప-ట్టన సమీపమున

సుమ వనమ్మున దిగి-శ్రమము దీర్చుకొని
యటఁగల యొక ముని-యడుగుల కెరఁగి
యీ యూరి పేరేది ?-యేలు రాజెవఁడు ?
అని యడుగఁగ నతఁ-డనియె నీరీతి
నిది నాగపురము-నేలెడి తేఁడు

భూచంద్రుండను-భూపాల సుతుఁడు
సార్థక నాముఁడై-చను పుణ్యరాజు
అతఁడు పుట్టిన యది-సుత-మింట మొగులు
కురియకుండుట జన-మెఱుఁగదు గిరులు
తరులు క్షేత్రమ్ములా-తత ధాన్యవితతి

నొసఁగు నాధి వ్యాధు-లొనరవు ప్రజకు
నని రాజు శీలమ్ము-ముని రాజు పలికె.

## ౨౫. గోపుత్రకుతో మణిపల్లవము చేరుట



రాజు దేవేరితోఁ - బ్రసవ వనంబుఁ
జొచ్చి యచ్చట ధర్మ - మూనృత వ్రతుఁడు
గురుఁడు ధర్మశ్రావ - కుని పదమ్ములకు
మ్రొక్కి యంజలి పట్టి - ముని మాన్య వలన
సుకృత దుష్కృతములు - సుఖ దుఃఖములును
జన్మగతులు ద్వాద - శ నిదానములును
మొనయు నిత్యానిత్య - ములు స్వభావమ్ము
బంధముల్ తెగఁద్రెంచు - పద్ధతుల్ సరవి
నెఱిఁగి బుద్ధుని యవ - తరణ మోపికను
విని యాఁడు తోఁడింత - కనని లతాంగి
కామ వికారమ్ము - శనుల చాపలము
కాంచక చేత భి - క్షాపాత్ర మూని
సాటి యెవ్వరు లేక - సద్ధర్మ సమితి
విను నీమె యెవరని - వేఁడు రాజునకుఁ
గంచుకి వినయంబు - గాత్రుఁడై పలికె
నేరేటి దీవి నీ - నెలఁతను పోలు
వారలు వెదకిన - లేరీమె వృత్త
మెలమిఁ జోళాధిపు - చెలిమి నాసించి

కలమును కావేరి - గట్టున నిలిపి
పురము చేరితి నట - గురుతపశ్శాలి

యఱవణమహాని యీ - యతివ వృత్తంబు
తెలిపి వాఁడని మున్నె - తెలిపితిఁ దమకు
నటనుండి యీయమ - యిట కేగుదెంచె
నన మణిమేఖల - యవనీశ తిలక !
నీ చేతి పాత్రమే - నాచేతి కిపుడు

వచ్చిన యది వర - భాగ్యంబు కలిమి
నంతరంగ కళంక - మందిన కతన
మఱచితి తొలుజన్మ - మెఱుఁగవ లైన
నిపుడు నాఁబట్టి యుం - చెఱుఁగమి వింత
మణిపల్లవముఁ బ్రద - క్షిణ మాచరింప

కున్న బంధమ్ముల - నొవరించి క్రుంచు
జన్మస్థితు లెఱుంగఁ - జాలవు సుమ్ము
ఱట కీవు రమ్మని - యతనితోఁ బలికి
యటనుండి యెగిరి య - పార్వతి వచ్చి
మమున వ్రాలక మున్నె - మహిమీఁద వ్రాలి

యులలు పదవి తావి - కలిమిని దెలుపు
తీరమం దెల్లెడఁ - దిరుగుచు వచ్చి
మణిపల్లవము ప్రద - క్షిణము మొనరించి

బుద్ధ పీఠికఁగాంచి - మ్రొక్కి నిల్చుటయుఁ
దన్మణి పీఠి స్వ - జన్మ వృత్తంబు

వినిపింపఁ గాయ గ - ట్టను నేటి దరిని
బ్రహ్మ ధర్ముని పద - పంకజములను
దరిసించి సేవించి - ధర్మ సంగతులు
విని వినుతించి [1] పృ - థ్వీపుఁడో నవంతి
కరుగు వారలకుఁ బ్రి - యమ్మున మృగము

లుగ మఱి నారకు - లుగ భూతములుగఁ
బొనరించు దుష్కర్మ - ములు [2] పది విడుఁడు
పీడిన మీరలు - వేల్పులు గాఁగ
మనుజులుగాఁగ బ్ర - హ్మలుగ నయ్యెదరు
కాన సత్కృతి [3] దశ - కమ్మును విడక

యెడ పీడక శ్రమలఁ - బడియుఁ జేయుండు
పండిత వరుఁడు స - ర్వజ్ఞుండు జగము
నుద్ధరించుకొఱకు - నొక్కఁడై తోఁచు
విభుని ధర్మమ్ములు - వినువారు గాక
వలవని జన్మముల్ - తొలఁగించు కొనెడి

---

1. పృథ్వీపుఁడు హస్తిపతి.
2. కొల మొదలగునవి.
3. అహింస మొదలగునవి.

వారలు గారని - వార్యమా మిత్తి
యరుదెంచు మును ధర్మ - మాచరింపుండు
అని వివరించి జి - హ్వాయనెడి కొడుపు
గొని వాయి యను పల - కను గొట్టి తెలుపు
నుపదేశముల విని - సుపవిత్ర చరణ

ములఁ జాఁగి వినుతింప - బలు కటు వార్త
వినిపించితిరి దీని - కేని కతమున్న?
యనివేఁడ బుద్ధుండు - జనియించు మున్నె
బలభేది యాపీఠి - నిలిపి యున్నాఁడు
బుద్ధదేవునిగాక - మోవదు పీఠి

పీఠిక మోసిన - పిమ్మటఁగాక
వాసవుండు నుతించు - వాఁడు కాఁడుచుమి
అచటి కేగినఁ బూర్వ - మందలి జన్మ
వృత్తమ్ము లాధర్మ - పీఠిక తెలుపు
నని ప్రసాదించెఁ గా - వున నిష్ఠ నాకుఁ

దమము తొలఁగఁ బురా - తన వృత్త మెల్లఁ
దెలిపితి సత్తప - స్వుల వాక్కు లెపుడు
సఫలమ్ములే యని - సన్నుతిసేసెఁ
బుణ్య రాజచ్ఛటఁ - బుష్పవనమ్ము
విడిచి యంతి పురిఁ బ్ర - వేశించి యచటఁ

దల్లి పశువుగాఁగఁ - దండ్రి తపసిగ
వచ్చు జన్మము ముని - వలనఁ బ్రేగు గమి
చుట్టక యట నొక - సొన్నంపు గ్రుడ్డు
నందడంగినదియు - నాతని కరుణఁ
బుత్రులు లేకుండు - భూమిచంద్రుండు

కొని పోయినదియును - తన తల్లియైన
యమరసుందరి యను - నయ్యామ వలన
విని చాల చింతించి - వెనుకటి జన్మమునఁ
దల్లి చేసినదియుఁ - దత్యాశ్వాగతులు
గమనించి మది.గుంది - ఘనుల సేవించి

నాటకంబులఁ గాంచి - పాటలాలించి
దేవేరి యులుకను - దెలిసి ప్రచ్ఛలఁగఁ
బదముల సన్నిధి - వ్రాలి యామీఁద
కుచముల పైని కుం - కుమ రేఖ వ్రాసి
తురుమున విరిసరుల్ - తురిమి మొగ్గలను

పోలిన చిఱునవ్వు - పోల వీక్షించి
మోముచందురునందు - మొలచిన నల్ల
కలువల నెట్టని - కొలుకులు కలత
చెందంగఁ బువ్వుటమ్ము - చెలికు సింగాణి
మరుఁడు తడవఁ గాను - మద్యాంబు నాని

యూడుట తనలోనఁ - గ్రేడించి దానఁగు
తొలఁగ వీడుట మంచి - తోయమాంచెంచి
మహిమాన్వితుంకు ధ - ర్మ శ్రావకుండు
నా వీనుల మొదట - నాటిన విత్తు
మణిమేఖలయును కా - రణ మాటవలన ౧౦౦

భంగమేమియులేక - ఫలియించె నేడు
నిక్కమానుచుఁ బుణ్య - నృపతి పల్కంగ
మనసు మాఱెను మన - జనపతి కనుచు
జనమిత్రుఁడను మంత్రి - వినుతించి మఱియు
విజయీభవ నృపేంద్ర! - విభవ దేవేంద్ర! ౧౦౫

ఈవు పుట్టక పూర్వ - మీదేశమందు
వానలు లేమిని - పంటలు లేక
తల్లి బిడ్డల గాదఁ - దడవక శాము
మఱుఁగుగ భుజియించు - తెలుఁగు దేశమున
జనియింప మందు వే - పఁగిని మేఘమ్ము ౧౧౦

తోఁచె ననఁగ నీవు - తోఁచి జలమ్ము
నించి తంతటఁ బ్రాణి - నికురుంబమునకు
వాన తప్పకపడెఁ - బంటలు బలిసె
నాఁకలి పెను దగ - లంతరించినవి
నీవేగు తరువాత - నీదేశ జనము ౧౧౫

తల్లిని నీఁగిన - పిల్లల కరణి
గోడు గోడను ధ్వని - గుడికొనఁ గుంద
రక్షణ స్థితిలేక - రాయిడి పడఁగ
వీడి నీవు ముగితి - వేఁడితివేని
స్వార్థపరుఁడ వను - జన నింద యబ్బుఁ

దన మేలు కొఱకుఁ జిం - తనము సేయకయ
పరులఁ గావఁగఁ బాటు - పడిన యా బుద్ధు
పద్ధతి యిదికాదు - పరికింపు దేవ!
యని పల్క విని ఱేఁడు - మణిపల్లవమును
వలగొన నెంచిన - బలితంపుఁ గోర్కి

నడఁపంగలేక రా - జ్య విచారణమ్ము
పౌర రక్షణమును - బంధు రక్షణము
నీ యది క్రమ్మఱి - నే వడి వత్తు
నని నావికుల నౌక - లాయత్త పఱుప
రప్పించి కడలి తీ - రము చేరి కలము

నెక్కి హుటాహుటి - నేగ నారోడ
మణిపల్లవ ద్వీప - మున నిల్వ కవల
నా సమీపమ్మున - నరుగుట గాంచి
మణిమేఖలయు లోన - ఘన మోద మంది
దాసి ప్రభునితోడఁ - దత్తీర భూమిఁ

జూచుచు దీవిని - చుట్టి రాజేంద్ర !
యరయుము జన్మ వృ - త్తాంతముల్ దెలుపు.
ధర్మపీఠమిది వం - దనము చేయుమన
నాతండు వలగొని - యాంజలి పట్టి
మ్రొక్కి - నిలువ రాజు - పూర్వ వృత్తంబు ౧౪౦

కరతల మందుండి - కాంచెడి వారి
మోము చూపెడి యద్ద - ముం బోలె రత్న
పీఠము చూప న - వ్విభుండు నాజన్మ
మెఱింగితి నిడుమలు - పరుగులు వాఱె
మధుర యందున్న చం - పావతీ దేవి ! ౧౪౫

నడురేయి బోరునం - బడు వానయందు
కడుపులం గాల్చు నాం - కటి బాధవలనం
జీంకటి కంజక - చేరి మండపము
తిరిసి తినెడి నన్ను - దఱిసి వేండంగ
వారి కన్నంబిడ - వాంఛించి యేడ్చు ౧౫౦

నను గని నాడు వా - నలు లేక వరటి
నను తఱింగని పాత్ర - నాచేతి కొసంగి
బిచ్చ మెత్తెడి పని - వీడి బీదలకు
నన్నదానము సేయు - మని యానతిచ్చి
భవ దుఃఖములం బాపు - భారతీదేవి ! ౧౫౫

తెలివి తేటలఁ బ్రసా-దించెడి తల్లి !
అమరులకైన బ్ర-హ్మలకైన నాల్క-
కలుచ గడుగు నీ వి-మల చరణములు
మఱి మఱి పుట్టిన-మఱవను తల్లి
యని వినుతించి య-య్యవనీశ్వరుండు

మీఱు వేడ్కను మణి-మేఖలతోడ
నిరృతి దిశఁ జని-నీరజాకరము
గోముఖి కడఁ బొన్న-గున్న పెన్నీడ
నుండ నద్దీవి యం-దుండెడి ద్వీప
తిలక యటకు వచ్చి-దీవించి మున్ను

చేత నన్నము గొని-జీవులఁ గాచు
పావన చారిత్ర !-వచ్చితి విటకు
నాఁడు మఱచి నిన్ను-వీడిన వారు
క్రమ్మఱు లెఱి వచ్చి-కాంచి నీ స్థితిని
నీవలె జీవముల్-నీఁగి రిచ్చటనె

యువ్వణిజుల మేని-యస్థి రాసులివి
వారితో వచ్చిన-వారలు చావ
మిగిలిన యెమ్ములు-మిట్ట లయ్యెవియు
విరిసిన యాపొన్న-తరువు పెన్నీడఁ
గొరటాలు చేర్పంగఁ-దెరలిన యిసుక

కుప్పలో నీయెంప - గూఁడదు పూఁడినది
నీప్రాణములఁ బట్టి - నీవ తీసితివి
నీప్రాణమ్ములకుఁ గ - నికరించు వారి
ప్రాణములం గూడఁ - బాపితి వీవు
ఘన హింసకుండవు - గద ! - యట్టి నీవు

పార్థివేంద్రుఁడ వైన - వై చిత్రి కంటె !
పలువురు మ్రొక్కెడి - పాత్రంబు గొన్న
యో మణిమేఖలా ! - నీ మహానగర
మంబుధిలోఁ జొచ్చి - యడఁగి పోయినది
నాగదేశము నేలు - నాథుండు రత్న

కంకణు సుత పీలి - కంకణ యనెడి
సుందరి సూర్య వం - శ్యుండగు రాజు
వలనఁ గాంచిన తన - పట్టితో వచ్చి
యీదీవి వలగొని - యింద్రుండు నిలుపు
మణి పీఠమును బ్రద - క్షిణము గావించి

ప్రణుతించు తఱిని కం - బళ సెట్టి కలము
రాఁగ నతని పాలి - కేగి యా రమణి
రాకుమారుఁ డితండు - కై కొని పోయి
యతని కొసంగుమ - యని యీయ నతఁడు
మోదాతిశయమున - మ్రొక్కి యాయమకు

బాలకుఁ గొని రేవు - వదలి కలంబు
నడపుచుఁ బోవు నా - నాఁడె చీఁకటిని
కరడుల తాఁకునఁ - గలము వ్రీలినది
అందలి వారలు - కొందఱు రాచ
బిడ్డఁ డబ్ధిఁ బడుట - విభునకుఁ దెలుప
నాతండు కొడుకున - కైన యాపదకు
మది నోర్వఁ జాలక - మణి నీఁగుకొన్న
నాగంబు కరణిఁ గా - నలు సబ్ధి దరులు
వెదకుచు నుండంగ - వేల్పుల జేని
పబ్బంబు నప్పుర - వరము పా నినది
మణిమేఖలాదేవి - మది నోర్వలేక
పురముఁ దరంగలు - ముంచుఁ గాక నియె
నా శాప వశమున - నంభోధి రేఁగ
నలలు పెల్లుగ వచ్చి - యువ్వీటి మ్రింగ
నొంటరియై యెందొ - యొడయండు వోయె
మాధవియును సుత - మఱియు నఱవణ
మునియుఁ దొలఁగి వంజి - పురిఁ జేరినారు
పలువురు సేవింప - వనధిని గాచు
నా దేవి వచియించి - నది విన్న నీవు
పరితపింతువు సుమ్ము - త్వద్వంశ పూర్వ

మణిమేఖలా దేవి - గొని కాచి విడుచు
తఱి నటఁ దోనరించు - దాన వృత్తంబు
నఱవణముని తెల్ప - నట విందు వనుచు
ద్వీప తిలక యేగు - పిమ్మట రాజు
పలలమ్ము లేని యె - మ్ముల గూఁడు కట్టు    ౨౨౦
పీడి సున్నంబున - పిరిసిన కరణి
నుండు దానిం గాంచి - యుమ్మలికింప
నేమి కాంచితి ? వింత - యేమున్న దిందు
నీ దేశముం జేరి - నిన్నిట కేను
పిలుచుట నీ పూర్వ - వృత్తంబుఁ దెలిపి    ౨౨౫
నీ కీర్తి యీ దీవి - నేరేటి దీవి
నిలుపంగఁ గాని యి - ల్లెలయింపఁ గాదు
రాజులు తామె ధ - ర్మము లాచరించు
చున్నచో దోసంబు - లూష్ణంగ వలయు
నవసరమే యుండ - దవనీశ చంద్ర!    ౨౩౦
అట్టి ధర్మంబు లే - వందు వేని విను
విని విశ్వసింపుము - విని మఱవకుము
జనుల కెల్లరకును - తినఁ దిండి కట్టి
బట్టయు వసియింపఁ - బట్టును గాక
వేఱేమి వలయును ? - పృథివీశ ! యనుడు    ౨౩౫

నరపతి యిట్లను - నా దేశమందు
పరుల దేశము లందు - పాటించి నాకు
నీ వుపదేశించు - నెఱి యొనరింపఁ
జనువాఁడ నా పూర్వ - జన్మంబుఁ దెలిపి
నన్నుద్ధరించితి - నిన్ను నే వీడఁ
జాల ననఁగ నామె - జాలి నొందకుము
నీ విచ్చటికి రాఁగ - నీ కోఱ కడలి
వా యెత్తి పిలిచె నీ - పాలిత భూమి
కలమెక్కి చను మేను - *కరువూరి కేగు
దాన నంచేగె నం - తర్మార్గ మందు.

## ౨౬. వంజి చేరుట

మినువీథిఁ జని మణి - మేఖల యంతఁ
దనియని ప్రేమతోఁ - దల్లి కన్నగిని
తండ్రియై దాతయై - తనరు కోవలుని
విగ్రహములఁ గాంచు - వేడ్క తొల్కాడ
గుడి వల గొని చొచ్చి - కడు భక్తితోడ

* వంజి, కివపూరు, కరూరు చేర రాజధాని పేళ్ళు.

మ్రొక్కి నిలిచి కేలు - మోడ్పు ఘటించి
పలు విధముల నా మెం - బ్రస్తుతి చేసి
సహ మరణమ్మును - సత్తపోవృత్తి
గొనక పాతివ్రత్య - మునన నీ పాడి
నెఱవేర్చు హేతువు - నెఱి తెల్పు మనుచుఁ

బలవించుచు నిలువఁ - బత్ని దైవంబు
పలికె నిట్లనుచు నా - పతి కబ్బినట్టి
యిడుమ కోర్వఁగలేక - యీరస మూని
పురమును దహియించు - తఱి మధురాధి
దేవత కనఁబడి - తేఱ నిట్లనియె

నియ్యది మీ పురా - కృత కర్మఫలము
జగతిఁ గళింగ దే - శమ్మున దాయ
లగు నృపతులు వసు - వను వాఁడు కొమరుఁ
డను వాఁడు వేఱ సిం - హపురంబు కపిల
పురము నేలెడి వారు - ఘూని వైరమ్ము

పోరున కేగక - తీఱకుండు తఱి
ధనము సంపాదింపఁ - దలపోసి పెక్కు
వగల నసొమ్ములైన - నగలఁ గైకొనుచుఁ
జెలువయూ నీలతో - సింహపురమ్ము
చేరి గుట్టుగ నుండె - చేరి సంగముఁడు

వానిని గని ధాన్య - వణిజు లీరసను
గుజ గుజ వోయి యా - కువలయేశ్వరుని
యుద్యోగి నీపతి - యుంగ నొప్పు భరతు
నకుఁ జెల్ప నాతఁడా - నగల వర్తకుని
గొని పోయి యరుల వే - గిని నరపతికిఁ

దెలిపి నిర్దోషిని - పాలియించె నతని
సతి దిక్కు లేనిదై - వెతగొని కుంది
పలవించి పలవించి - పర్వత మెక్కి
పడుచుఁ దా నిడిన శా - పము ఫలియించె
ననియెఁ బురాకృత - మది నీకునేమి ?

అవలను కినుక చ - ల్లారమి వలనఁ
బురము దహించితిఁ - బుణ్య కర్మముల
వలన వేల్పుల మైతి - మిలఁ జేయు సుకృత
దుష్కృత ఫలము లే - తోయాన నైనఁ
గుడుపక వీడి యె - క్కడకును పోవు

పై లోకమునఁ గొన్ని - ఫలియింపకున్న
భువిని జన్మంబులఁ - బూనిచి కుడుపుఁ
గావునఁ బుట్టుచుఁ - గడచుచుఁ బూర్వ
సంగతుల్ మఱచుచు - జన్మపయోధి
మునుఁగుచుందుము ముక్తి - గనలేమ తుదకు

వర్షమ్ము సతతమ్ము - పడుచుండు మగధ
దేశలక్ష్మికి నేటి - తిలకమై యొప్పు
కపిలవాస్తువు నందు - కడు సార్థకముగఁ
* బారమిత లలవి - మీఱ నిండించి
పావనుండగు బుద్ధ - భానుండు పొడమి
బోధి మూలము చేరి - బోధించినట్టి
నాల్గు సత్యంబులు - నలువుగఁ బదియు
రెండయిన నిదాన - రీతులు దాని
నాశ విధానముల్ - నయముగఁ దెలిసి
దుఃఖవిముక్తిని - తోడ్తోడ నొంది
చక్రవాళము లోని - జగ మెల్ల యెడల
ధర్మ కిరణములఁ - దనరించు వేళ
నింద్ర విహారమ్ము - లేడింటఁ గట్టు
వేళ దుఃఖ గతులు - వీడి కారుణ్య
హృదయమ్ముతోఁ దెల్పు - సదమల ధర్మ
వచనముల్ విని నేము - ప్రశమమ్ము నొంది
ప్రభవమ్ము వదలి ని - ర్వాణ మందుదుము

---

*పారమిత = ఒడ్డు అవతలవైపు అర్థము గలిగి రూపొంద దానాదులను పూరించుట. ఇవి పది. ౧ దానపారమిత. ౨ శీలపారమిత. 3. క్షమాపారమిత ౪. వీర్యపారమిత. ౫. ధ్యానపారమిత ౬. ప్రజ్ఞాపారమిత. ౭. ఉపాయపారమిత. ౮. దయాపారమిత. ౯. బలపారమిత. ౧౦. జ్ఞానపారమిత.

